# సమాలోచన



జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 4 రాజమహేంద్రవరము 16-2-1981 సంచిక 8

—* ఈ సంచికలో *—



1—3—81 సంచికలో భ్రమరగీతములు, తుమ్మలవారి రాష్ట్రగాన రామణీయకము, నలదౌత్యము – తులనాత్మక పరిశీలన, సులోచన, నాటకాల్లో వాస్తవికతావాదం మొదలగునవి ఉంటాయి.

—* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *—

చందా :
సంవత్సరమునకు రు. 12—00.
అర్థసంవత్సరమునకు రు. 6—50.

విడిప్రతి 60 పై.



# ★ సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

సంపాదకుడు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

Retired Telugu Lecturer, V. T. J. College, Rajahmundry.

సంపుటము 4 రాజమహేంద్రవరము 16-2-1981 సంచిక 8


## చేమకూర కవితా చమత్కృతి


— శ్రీ ఎ. క్రిష్ణప్ప, ఎం. ఏ., బి. ఎస్‌సి.


అభినవ భోజరాజ బిరుదాంకితుడైన రఘునాథ నాయకుని ఆస్థాన కవి పుంగవులలో ప్రథమస్థానము నాక్రమించినవాడు చేమకూర వేంకటకవి. సారంగధర చరిత్రము, విజయవిలాసము ఈతని రచనలు. విజయ విలాసములో చేమకూర కవితా చమత్కృతిని గూర్చి వివరించడమే యీ వ్యాసము ముఖ్యోద్దేశము. ముద్దులొలుకు రీతిగా, ముచ్చటగా మూడాశ్వాసాలతో ముగించబడింది ఈ ప్రబంధము. దక్షిణాంధ్రసాహిత్యముపై ఒక విమర్శ ఉన్నది. వ్యాకరణ బద్ధముకాని భాష, మోహ శృంగార ప్రాధాన్యము, అనుకరణ విధానము అను మూడు అపవాదములు గలవు. కాని చేమకూర వేంకటకవి యీ అపవాదముల కవకాశ మియ్యక విజయ విలాసమును విశిష్టమైన కావ్యముగా రచించెను.

చేమకూర వేంకటకవి తన కవిత్వ ప్రశంసను గూర్చి రఘునాథరాయలన్నట్లు విజయవిలాస కావ్యారంభములో క్రింది పద్యములలో పేర్కొనెను.

'వాసించు కవిత చెప్పిన
మీసరవో వొకట; భక్తి విశ్వాసంబుల్
నీ సొమ్ములు; సామాన్యుడ
వే సూర్యవరప్రసాది విజ్జగ మెఱుగన్' (1-49)

'ప్రతి పద్యమునందుఁ జమ
త్కృతి గలుగం జెప్ప నేర్తు; వెల్లడ బెళుకౌ
కృతి వింటి మపారముగా
క్షితిలో నీ మార్గ మెవరికిన్ రాదుసుమీ' (1-50)

సామాన్యముగా కవులు తమకావ్యములలో కొన్నిచోట్ల మాత్రమే చమత్కారముగా చెప్పెదరు. కాని చేమకూర వేంకటకవి ప్రతి పద్యమునందు చమత్కారముండునట్లు రచించెను. ఈ ప్రశంస రఘునాథరాయలు వాస్తవముగా అన్నదో, తానే వ్రాసికొన్నాడో తెలియదు గాని, విజయ విలాస కావ్య పరిశోధకులకు మాత్రము పై ప్రశంస అత్యుక్తి కాదనిపించును. చేమకూర వేంకట కవి రఘునాథరాయలను మెప్పించుటకు రఘునాథరాయల కావ్యములలో గానవచ్చు రసపుష్టి, స్వభావ వర్ణనలు, కథను నడిపించు నేర్పు, శబ్దార్థ భావములలో చమత్కారము, ప్రసన్న కవిత్వము మొదలైన గుణాలను విజయ విలాసము నందు పొందుపరచెను.

చేమకూర కవి చిన్న యితివృత్తమును గైకొని పెంచి మూడాశ్వాసముల శృంగార ప్రబంధముగా తీర్చిదిద్దెను. అర్జునుడు బ్రాహ్మణుని గోవును రక్షించుటకు విల్లంబుల కొరకు ద్రౌపదీ ధర్మజులు గృహమున ఉండగా ప్రవేశించుట, తత్పరిహారార్థము మొదటి ఏర్పాటు ప్రకారము ఒక ఏడాది అర్జునుడు భూప్రదక్షిణమునకు బయలుదేరుట, ఉలూచి, చిత్రాంగద, సుభద్రలతో విజయుని విలాసములు; నిందలి యితివృత్తము. చేమకూర కవి విజయు విలాసములను శృంగార భరితముగ అతి రమణీయముగ వర్ణించెను.

చేమకూర కవి రఘునాథరాయలనే కావ్యనాయకుడైన విజయునిగా తలంచి రచన సాగించినట్లు క్రింది పద్యము వలన ఊహింపవచ్చును. విజయు వీరత్వమును గూర్చి వ్రాయుచు

'పాఱఁ జూచినఁ బరసేన పాఱఁ జూచు
వింటి కొరగిన రిపురాజి వింటి కొరగు
వేయు నేటికి? నలపాండవేయు సాటి
వీరు డిల వేడు, ప్రతి రఘువీరు డొకడె' (1-94)

అని చెప్పెను. విజయునితో సమానమైన ప్రతిగా రఘురాముని పేర్కొనెను.

రఘునాథరాయలు మాత్రమే అన్నది ధ్వని. అట్లే ఉలూచి శృంగార పురుషుడను కానని అర్జునునితో నిట్లనెను.

'నిను గీతి సాహితీ మో
హన వాణులు సెవులం బట్టి యాడింపంగా
గని యుండి, కాముకుడ
గానని' పల్కిన నాకు నచ్చి కొనె
నృపాలా!' (1-551)

రఘునాథరాయలు సంగీత సాహిత్యములు బాగుగ ఎఱింగినవాడని అవి తడంచినట్లు ఆడినవాడన్నది ధ్వని.

చేమకూరకవి తన విజయవిలాస కావ్యకన్యకను రఘునాథరాయల కిచ్చుటకు ఎన్నుకొనెను అర్జునుని గాంచిన చిత్రాంగద తండ్రి యిట్లు తలంచెను.

'చక్కదనంబు రూపున బొ
సంగుటె కాదు, గుణంబులందునున్
జక్కదనంబు గల్గెనెఱ
జాణ, జగంబున నీడులేని నా
చక్కని కూతునుం దొఱయఁ
జాలిన వాడితడౌ నగా
మిక్కిలి కీర్తి గల్గు' నని
మెచ్చు మనమ్మున రాజు సారెకున్' [1-223]

వైపద్యము వలన చేమకూరకవి తన కావ్యకన్యక రూపును, గుణమును మెచ్చుకుంటూ తన కావ్యమును జగంబున నీడులేని దానినిగా భావించి, రఘునాథరాయలకు కృతి నొసంగిన మిక్కిలి కీర్తి కలుగునని భావించినట్లూహింపవచ్చును. చేమకూర కవి కావ్యారంభములో 'పరిగ్రహింపుమయ్యా రఘునాథ భూపరసికాగ్రణి మామక కావ్యకన్యకన్' అనెను.

చేమకూరకవి విజయ విలాసమునందు శృంగారరసమును పోషించెను. ప్రారంభములో కావ్యప్రధాన నాయికయైన సుభద్రను గూర్చిన అంగాంగవర్ణనము గరుని చేత చమత్కారముగ చెప్పించి అర్జునకు సుభద్రపై ప్రేమ పెరుగునట్లుచేసెను. ఉలూచి నాగకన్య. తాను విజయుని వలచినది; చిత్రాంగద మర్త్యకన్య, విజయుని చే వలపింపబడినది; సుభద్రా విజయులు ఒకరి నొకరు వలచినవారు. ఒక నాయకుడు మూడువిధముల నాయికలను వివాహ మాడిన 'విజయ విలాసములు' చేమకూర కవి వర్ణించెను. చేమకూరకవి పడతివలచి వర్ణించిన శృంగార మొకరీతిగ, మగవాడు వరించిన మగువతో శృంగారము మరొకరీతిగ, మగువ - మగవాడు నిరువురు ఒకరినొకరు ప్రేమించినప్పటి శృంగారమును వేరొకరీతిగ వర్ణించెను.

చేమకూర కవి విజయవిలాసకావ్యమునందు సహజ వర్ణనముల కెక్కువప్రాధాన్యము నిచ్చెను. వివాహము జరుగునప్పుడు కలసిన అమ్మలక్కలు ఒకరినొకరు వారి వారి వరుసలను గూర్చి చర్చించుటము సహజము. అర్జునుని వివాహము సుభద్రతో జరుగునప్పుడు శచీదేవి దేవకీదేవితో నిట్లనెను.

'వీరు పురాలవైతిగద
వే యిపు డత్తవు తొంటివావి; నో
తోయజనేత్రు గాంచిన వ
ధూమణి నీ సుత బెండ్లియాడగా
నాయము నాకు మాకునకు
నర్మిలి హత్తగ నత్తవావిచే
నాయువు గల్గువాడవు న
టంచు! శుభంబగు దీన నెంతయున్' [3-116]

కృష్ణుని కనినందువలన శచీదేవికి దేవకీదేవి అత్త, దేవకీదేవి కుమార్తెను అర్జునుడు పెళ్ళియాడుటవలన వదినె. అర్జునునకు సుభద్ర అత్తవరుస కల్గినదని తెలియజేస్తూ 'అత్తవావిచే నాయువు గల్గువాడవు నటంచు' అను లోకోక్తిని చెప్పెను.

కథను వేగముగ నడిపించుటలో చేమకూర కవి నేర్పు రమణీయమైనది. ప్రబంధ కవులవలె కథను నిల్పి అష్టాదశవర్ణనలు చేయుట ఇతనికి సరిపడదు. కనుక శరీరములో భాగముగానే విడదీయరానట్లు వర్ణించెను.

పెళ్లికి ఇంద్రుడు వచ్చునప్పుడు అర్జునుడు కృష్ణుని చెల్లెలి మెడలో కట్టుటకు తాళితెస్తున్నట్లున్నదట చంద్రుని దర్శనము.

'నందకుమారానుజ యట
తం దన నందనుడు గట్ట దైవతపతి వే
డ్కం దెచ్చు తాళి బొట్టన
జందురు డరుణరుచి బ్రాద్దికన్
గన నయ్యెన్' [3-94]

తాళిబొట్టు గుండ్రముగ ఎఱ్ఱగ ఉండును. అప్పుడే పుట్టిన చంద్రుడు అరుణకాంతిని పొంది తాళిబొట్టును బోలియున్నాడనుట, కవి సాయంకాలమైందని, ఆరోజు పౌర్ణమి అని ధ్వని ప్రాయముగ జెప్పెను. ఈ వర్ణన పౌర్ణమినాటి సాయంకాలము చంద్రుడు పుట్టినప్పుడుండు సహజ వర్ణనము.

అట్లే వసంత ఋతువర్ణనము చేయునప్పుడు కూడ సహజమైన విషయములు చేమకూర వేంకటకవి వ్రాసెను.

'క్షితిపయి వట్రిమ్రాకులుంచి
గిర్వవసంతుడు, దా రసోప గుం
భిత పట వాసనల్ నెరప
మెచ్చక చంద్రుడు మిన్నునన్ ప్రస
న్నతయును సౌకుమార్యము గ
నంబడ దాల్గరగంగ జేసె, నే
గతి రచియించిరేని సమ
కాలము వారలు మెచ్చరే కదా' [1-210]

వసంతుడు ఎండిన చెట్లు చిగిర్చి రస భరితముగ, సువాసనలను వెదజల్లునట్లు చేసెను. దీనిని మెచ్చక చంద్రుడు వెన్నెలకాసి విమల కోమల గుణములతో చంద్రకాంతపు రాళ్ళను కరగునట్లు చేసెను. చేమకూరకవి సమకాలములో రసోపగుంభిత పదవాసనలు నెరపు కవిత్వమునుగాని, ప్రసన్న సౌకుమార్య లక్షణ సమన్వితమైన కవిత్వముగాని మెచ్చరేదని తెలిపెను. వసంతకాలములో చెట్లు చిగిర్చి సువాసనలు వెదజల్లుట, చల్లని వెన్నెల కాయుట సహజములు. చేమకూర వేంకటకవి సమకాలనూ వారిని మెప్పించవలెనన్న కోరికతో విజయవిలాసమునందు 'రసోపగుంభిత పదవాసనల్ నెరపు'నట్లును, ప్రసన్నతా సౌకుమార్యములు గనంబడునట్లును రచించెను.

చేమకూరకవి విజయవిలాస కావ్యమునందు ప్రతిపద్యము చమత్కారముగ ఉండునట్లు రచించెను. శబ్దాలంకారములలో యమకము, అర్థాలంకారములలో శ్లేషము, వ్యతిరేకము చమత్కారమునకు బాగుగ ఉపయోగ పడినవి. చేమకూర కవి యమకమునకు మాటల విరుపులు ప్రాంధాన్యమును వహింప జేసెను. గదుడు సుభద్రను గూర్చి ఈవిధముగ వర్ణించెను.

'నలిన లీల నంచు నలినలిగావించి-
నించు మించు లాడు నించు మించు
లేమ నగవు జాపు లేమన నగు బాపు
జగ మెఱుంగు దాని జగ మెఱుంగు'
[1-10]

ఇందు సుభద్ర అందమూ, నగవు అతి రమణీయముగ వర్ణింపబడినవి. అశ్లే

'రమణ నట్టింటి పగవాడు కమలవైరి
కంసు బోలిన యుగ్ర శేఖరుడు వాడు
మేనమామ మని చూడక మాను చెలిమి
యొకటపైవచ్చు బెరుగవే హరికుమార'
[3-46]

అని చెలికత్తెలు మన్మథునికి హితోపదేశము చేస్తున్నారు. లక్ష్మికి ఆసనము పద్మము. పద్మమునకు శత్రువు చంద్రుడు. కాబట్టి 'రమణ నట్టింటి పగవాడు' అని తెల్పి చమత్కరించెను. చంద్రుడు లక్ష్మికి అన్న. మన్మథునకు మేనమామ. శ్లేషార్థములతో చమత్కరించుటలో చేమకూరకవి అందెవేసిన చేయి.

చేమకూరకవి వ్యతిరేకపదాల ప్రయోగముతో నతి రమణీయముగ చమత్కరించెను. అర్జునుడు మొసలిని బట్టి బయట వేయగా మొసలి రూపు మగువగ మారినది. ఆ రూపును చూచిన అర్జునుడు ఇట్లు తలంచెను.

'ఈ బాల మోమునకు నా
జాబిల్లికి నెంత దవ్వు, సరివచ్చునొకో
యీబిడ చనుగవ కోక మె
ట్టాబంగరుగట్టు తక్కువౌ నెంచంగన్'
[2-48]

ఆ బాల మోమునకు జాబిల్లి, చనుగవకు బంగరుగట్టు సరిరావని తెల్పెను. చనుగవను బంగరు గట్టుతో బోల్చి చెప్పుట ఒక విశేషము.

చేమకూరకవి కొన్నిచోట్ల వ్యాజస్తుతి అలంకారమును ఉపయోగించి చమత్కరించెను.

'కడు హెచ్చు కొప్పు దానిన్
గడపన్ జనుదోయి హెచ్చు కటి
యన్నిటికిన్
కడు హెచ్చు హెచ్చులన్నియు
నడుమే పసలేదుగాని నారీమణికిన్'
[1-104]

పై వర్ణనము సుభద్రను గూర్చి గదుడు అర్జునకు తెల్పునప్పటిది. కొప్పు హెచ్చు, తర్వాత చనుదోయి హెచ్చు, వాటిని మించిన హెచ్చు కటి. కాని నడుమే పస లేదు అని తెల్పెను. అనగా నడుము సన్న అన్న భావమును ఇక్కడ పొందుపరచెను. పడతికి సన్నని నడుముండుటయే అందము. అందుకే చేమకూర వేంకటకవి 'నడుమే పసలేదు' అని చమత్కరించెను.

చేమకూర కవి లోకోక్తులను ప్రయోగించుటలో గొప్ప నేర్పరి. అవి అనుకోకుండ అవసరమైన చోట్ల పక్షులవలె వచ్చి వ్రాలును. సుభద్రకు బుట్టినిల్లు వదలిపోవుట యిష్టములేదు అప్పుడు చేమకూర కవి లోకోక్తిని కలిపి యిట్లు చెప్పెను.

'అత్తవారింట సకల భాగ్యంబు లున్న
మగనిమీదట దనకెంత మక్కువున్న
నాడు బుట్టువు పుట్టింటి కాసపడును
గావున సుభద్ర యొకతీరుగాగ నుండె'
[3-133]

అశ్లేయుక్తవయస్క అయిన సుభద్ర అంగాంగ వర్ణనము చేయు సందర్భములో ఇటుగాదె యొక్కొక్కనికిన్ నడుమంత్రపు గల్మి కల్గినన్' అనియు సుభద్రకు అర్జునకు బెళ్ళి అత్తవారి అని తెల్పి, అత్తవారిచే వాయువు గల్గువాడవు నటంద్రు'అనియు ఔచిత్యానుసారముగ లోకోక్తులను ప్రయోగించెను.

ఈవిధముగ చేమకూరకవి మాటల విరుపులతో వ్యతిరేక పదప్రయోగములతో, శ్లేషలతో, లోకోక్తులతో విజయవిలాసకావ్యమునందు ప్రతిపద్యము చమత్కారముగ నుండునట్లు రచించెను. 'గుణాంశ మొకించుక కల్గినన్ బళా యను' గుణము కల్గిన రఘునాథరాయలు సర్వగుణ సంపన్నమైన చేమకూర కవికావ్యమైన విజయవిలాసమును ప్రశంసింప కుండునా, ఈ విషయము సహృదయ హృదయైక వేద్యము!

—+—

# పెద్దనార్యుని ఆంధ్ర కవితా పితామహత్వము

– కుమారి డా. నందిరాజు కల్యాణి, ఎం.ఏ., పిహెచ్.డి.

సాహితీ సమరాంగణ సార్వభౌముడైన శ్రీకృష్ణదేవరాయల ఆస్థానమునందలి అష్టదిగ్గజములలో అల్లసాని పెద్దనార్యుడు శిఖామణి వంటివాడు. ఇతడు మనుచరిత్రము (స్వారోచిష మను సంభవము), హరికథాసారము మున్నగు గ్రంథములను రచించినట్లు తెలియుచున్నది. ఇతని రచనలలో మన కుపలభ్యమైనది మనుచరిత్ర మొక్కటియే. కొందరు విమర్శకులు దీనిని మనుచరిత్ర మనుట కన్నను 'మను సంభవ'మనుటయే సముచిత మనిరి. యథార్థముకూడ నదియే. అసలు పెద్దన దృష్టికూడ నదియే. అసలు కథాప్రారంభమున, ఆశ్వాసాంత గద్యమున అభ్యుదయ పరంపరాభివృద్ధిగ 'స్వారోచిషమను సంభవ' మనియే చెప్పుట అందుకు తార్కాణము. 'మను చరిత్రంబందుకొను వేళ' అనుటనుబట్టియు, 'ఈరీతి నీస్వారోచిషు, చారిత్రము వినిన వ్రాయఁ జదివిన ధనధాన్యారోగ్య పుత్రవంతులు, నైరూఢిగఁ గందురుపిదప నమరత్వంబున్.

[షష్ఠాశ్వాసం-122 ప.]

అను పద్యమునుబట్టి యీ గ్రంథమునకు మనుచరిత్ర' అని కొందరు నామకరణము చేసియుండవచ్చు. 'మను సంభవం బందుకొను వేళ' అని యున్నను గణభంగము కాలేదు. ఏది యేమైనను లోకవ్యవహారమున 'మను చరిత్ర'గానే ప్రసిద్ధిగాంచినది.

అసలు పెద్దనకు శ్రీకృష్ణ దేవరాయల సభాప్రవేశమున కర్హ్యముగా 'హరికథాసారము'ను చెప్పుకొనవచ్చును.

ఒక నాడు కృష్ణరాయలు 'ఇందీవరంబుల నీను కాల్గన్నుల శగడిందు ముఖులం చామరగ్రాహులిదా' యండగా, పణిన కూను కణాద బాదరాయణ సూత్ర ఫక్కి విద్వాంసులుపన్యసించుచుండగా; పార్శ్వభూమి సభీరు భట కదంబ కరాళ హేతిచ్ఛటాచ్ఛాయ నిగుడుకొనుచుండగా; సామంత మండనోద్దామ మాణిక్యాంశు మండలం బొలసి యీరెండగాయుచుండగా; మూరు రాయర గండ పెండార మణి మరీచి రింఛోళిఁ గలయానావృతము లగుచు; అంకపాళికట్టు దుకూలాంచలములు; చిత్ర మాంజిష్ఠ నిభమ శ్రీ వహింపగ భువన విజయాఖ్య సంసద్భవనస్థిత సింహపీఠి నలంకరించి ప్రాజ్ఞుల గోష్ఠిలో కవితా మధురిమ డెందమున మోసులెత్త గొలువుండి పెద్దనను గాంచి 'పెద్దనార్య! సప్తసంతానములలో ప్రశస్తి గాంచి ధాత్రిలోశిలముగా నుండునది కృతియే కాన మాకు శిరీష కుసుమ పేశల సుధామయోక్తులతో కృతి రచింపుము. హితుడవు, చతురవచోనిధివి అతుల పురాణాగమేతిహాస కథార్థస్మృతియుతుడవు; ఆంధ్రకవితా పితామహుడవు నగు నీవు స్వారోచిషమను సంభవమును భవచ్చతుర రచన కనుకూలంబుగ, రసనుముంచిత మగునట్లు మార్కండేయ' పురాణోక్త ప్రకారంబు చెప్పు'మని కర్పూర తాంబూలం బొసగెను.

సాధారణముగా, మహాకవులందరకు బిరుదు లున్నట్లే మన పెద్దనకు 'ఆంధ్ర కవితా పితామహు'డను బిరుదు కలదు. ఈ ఆంధ్రకవితా పితామహ బిరుదము పెద్దనకే ఏల రావలయును? అష్టదిగ్గజములు పలువురు కలరు కదా! అసలీ ఆంధ్రకవితా పితామహ శబ్దమున కర్థ మేమి? ఇతడు మను చరిత్రమును వ్రాసిన తరువాత ఆంధ్రకపితామహు డయ్యెనా? ఆంధ్రకవితా పితామహుడై మనుచరిత్రము వ్రాసెనా?

పితామహు డనగా బ్రహ్మగదా? కవిత్వమునకు బ్రహ్మ అందుమా – వాగనుశాసనుడు నన్నయగదా! లేక కవిబ్రహ్మ అనుటకు తిక్కనామాత్యుడు కలడు కదా! కాగా నీతని ఆంధ్ర కవితా పితామహ బిరుద మెట్లు అన్వర్థమయ్యెనో ఆలోచింపవలసి యున్నది.

కొందరు విమర్శకులు; పీఠికాకర్తలైన శ్రీ తంజనగరం – తేవప్పెరుమాళ్ళయ్య మొ॥వారు మనుచరిత్ర వ్రాసిన తరువాతనే ఆంధ్రకవితా పితామహు డయ్యెనని చెప్పుదురు. కాని మనుచరిత్రయందు కృష్ణరాయలు 'ఆంధ్రకవితా పితామహ' అని మనుచరిత్ర రచనకు పూర్వమే బిరుదును పేర్కొనినట్లు–

'హితుడవు చతురవచోనిధి
వతుల పురాణాగమేతిహాస కథార్థ
స్మృతియుతుడ వాంధ్ర కవితా
పితామహుడ వెవ్వరీడు పేర్కొన
నీకున్' [1ఆ – 15ప.]

అనుపద్యం ద్వారా వెల్లడియగుచున్నది. పీఠికాకర్త తం. తే. పెరుమాళ్ళయ్య మనుచరిత్ర రచన తరువాతనే బిరుదు వచ్చిన దనుటకు దీనికి పొంతన కుదుర కున్నది. కొందరు పెద్దనార్యుడు కృష్ణరాయల కన్న పెద్దవాడగుటచే నిచ్చెనని అభిప్రాయపడిరి. పేరున కూడ పెద్దన కదా అనియు అభిప్రాయపడియుండవచ్చును.

ఒక నాడు కృష్ణరాయలు పసిడిపళ్ళెరమున కవి గండపెండేరమును గొనివచ్చి సభాస్థానమున నిడి సంస్కృతాంధ్రములందు సమముగా కవనము చెప్ప నేర్చిన వారు దీనిని గైకొన నర్హు లని పల్క, సభ్యులు మిన్నకుండగా దానిపై కృష్ణరాయలు

ముద్దుగ గండపెండియర
మున్ గొనుడంచు బహూకరింపగా
నొద్దిక నాకొసంగుమని
యొక్కరుఁ గోరగ లేరు లేరొకో

అని సగము పద్యమును చదివినను అష్టదిగ్గజములును మిన్నకుండినవి. తుదకు పెద్దన సాహసించి 'పెద్దన బోలు పండితులు పృథ్విని లేరని నీ వెఱుంగవే, పెద్దన కీఁదలంచినను పేరిమి నాకిడు కృష్ణరాణ్ణృపా.' అని పూరించినాడు. అంతటితో ఆగలేదు. ఒకానొక సుదీర్ఘమగు ఉత్పలమాలికనుకూడ ఆశువుగా చెప్పినాడు. ఈమాలిక 28పంక్తులు కలిగినది. ఇందు తెనుగు సంబంధమైన 14 పంక్తులను చెప్పినాడు. ఆంధ్రకవిత్వ స్వరూపమును కోమల పదజాలముతో లతాంగి లావణ్యమునువలె వర్ణించినాడు. అటులనే సంస్కృత సమాసములను ప్రౌఢిమగల యువతీ సౌందర్యమువలె వర్ణించినాడు. ఈ మాలికను విని కృష్ణరాయలు ఆనంద పారవశ్యమున తన్మయుడై పెద్దనామాత్యుని పాదములంటి గండపెండేరమును స్వయముగా పాదము నలంకరించి నిండు పేరోలగంబున పెద్దనార్యుని కవితా పితామహుని గావించి యుండవచ్చును. రాయలు గండపెండేరమును తొడుగుటలో తాత్పర్యము కేవలము సమస్యపూర్తి చేసినందులకే కాదు లేక మాలికను చెప్పినందు కంతకంటెను గాదు. మరేమనిన ఆ మాలికలో 'ఆంధ్ర కవిత్వమనగా ఏ విధముగా నుండవలెనో' విశదీకరించినాడు. అందువలననే పెద్దన 'ఆంధ్ర కవితా పితామహు'డైనాడు.

కవిత్వానికి నిర్వచనమును అనేక విధాలుగ చెప్పిరి. కవిత్వం ఎన్నిరకాలుగా ఉండునో కూడ చెప్పిరి. కాని పెద్దన చెప్పుటలో వైశిష్ట్యం కేవలం అచ్చతెనుగు పదాలతో 14 పంక్తులలో ఆంధ్ర కవిత్వ స్వరూపాన్ని అందించాడు. అట్లని సంస్కృతము రాదనుటకు వీలులేదు. సంస్కృతమునందు కూడ విశారదుడు. కనుకనే తరువాత 14 పంక్తులలో సుదీర్ఘ సమాసముల నందించినాడు. అచ్చతెనుగు పదముల పొందిక 'పూత మెఱుంగులుం ... గావలె నచ్చతెన్గులీరీతిగ — నుండవలయును. సంస్కృతమును పచరించినచో 'భారతీ వధూటీ తపనీయ ... సారె సారెకున్-' అనురీతిగ నుండవలయును. అట్లయిన మనుచరిత్రము కేవలము అచ్చతెనుగు గ్రంథము కాదుగదా! ఈతని గ్రంథముగా పేరొందిన 'హరికథాసారము' అను గ్రంథము అచ్చతెనుగు గ్రంథము అయి ఉండవచ్చును. కాని నేడు నామావశిష్టముకదా! ఈ భావమునంతను అవగాహనచేసికొనియే రాయలు గండపెండేరముతోపాటు 'ఆంధ్రకవితాపితామహ' బిరుదమునిచ్చి ఉండవచ్చును. పితామహుని సామర్థ్యమును తిలకించిన కృష్ణరాయలు మనుచరిత్రమును రచింపుమని పెద్దననే అభ్యర్థించినాడు.

ఈ మనుచరిత్రము తరువాతి ప్రబంధ రచనకు మార్గదర్శకము. ప్రబంధమునకు పదునెనిమిది వర్ణనలుండవలె ననికదా లక్షణము. అట్లయిన వీటిలో ఏవి లోపించినను ప్రబంధము కాదా? మరి మనుచరితకు ప్రబంధమని వ్యవహారమున్నది కదా! అందు సముద్రాది వర్ణనలు లేవు కదా? కాని రసానుగుణమగు నట్టి పురవర్ణనాదులు కలవు కదా!

ప్రబంధమనగా ప్రకృష్టమైనబంధము కలది. ఈప్రకృష్టత కథాగమనము నందును, రచనా విధానమందును, రసపోషణమందును, అలంకార భూషణమందును, ఔచిత్య సంరక్షణ మందును, పాత్రలసంభాషణ యందును, సర్వే సర్వత్ర గోచరింపవలయును. ఈ మనుచరిత్రయందు కేవల ప్రబంధ లక్షణములే కాక నవ్యకవిత్వ లక్షణములును సమ్మిశ్రితములై యున్నవి.

అటు మార్కండేయ పురాణోక్త కథను స్వీకరించి ప్రబంధముగా రూపింప చేయుం ప్రాచీనతతోపాటుగా నిటు నవ్య కవిత్వ లక్షణానికి నాందిగా ఉదాత్త శృంగార రసమునకు శ్రీకారం చుట్టి ఆంధ్రకవితా పితామహత్వమును నిరూపించుకొనినాడు. నేటి నవ్యకవులకు ప్రకృతి వర్ణనయం దాసక్తి కలుగుటకు పెద్దనార్యుని ప్రకృతి వర్ణనయే మూలమై యుండవచ్చును. ఈ ప్రకృతి వర్ణనలు నవ్యకవిత్వమునకు ప్రధానలక్షణములు.

పెద్దనార్యుడు పితామహుడు కనుకనే మనుచరిత్ర రసప్రధానమైన కావ్యంగా అపూర్వసృష్టి చేసి ఆంధ్రసాహితీ లోకమున కందించినాడు. ఇందు శృంగారమంగిగా కనపడి తుదకు శాంతముగా పరిణమించుట విశేషము.

'అట జని కాంచె భూమిసురు
డంబరచుంబి శిరస్సరజ్ఝరీ
పటల ముహుర్ముహుర్లుఠ ద
భంగ తరంగ మృదంగ నిస్స్వన
స్ఫుట నటనానుకూల పరి
ఫుల్ల కలాప కలాపి జాలమున్
గటకచరత్కరేణు కర-
కంపితసాలము శీతశైలమున్.

(2 ఆ. 3 ప.)

పై పద్యమునందు అర్థానుసరణములైన శబ్దములు, అలంకారములు సెలయేటి గానానికి మరింత అందాన్ని చేకూర్చినవి. ఇందలి పదములు సడలింపులేక సెలయేటి గమనం, సెలయేటి గానంవలె పాఠకు లను గొంపోయి శీతశైలాన్ని దర్శింప చేయుచున్నవి. పాఠకులకు ప్రకృతిని ప్రత్యక్షముగా గోచరింప చేయుటలో నీతని కీతడే సాటి. పెద్దనార్యుని [illegible] యని పాఠకు లందరు హిమవత్పర్వతమును ప్రత్యక్షముగా చూచిన అనుభూతి పొందగలుగుచున్నారు.



'పసుపు నిగ్గులు దేఱం బొంప జన్నిద
మొప్పఁ... ... ...
... ... ...
నా మెఱుఁగుఁ దెఱంగె నీతుషారాద్రికతన'
(2 ఆ. 11 ప.)

ఇట్టి తావుల నవ్యత్వశోభితం గానుండ రచన గావించి ఆధునికు లగు కరుణశ్రీ మొదలగు వారలకు మార్గదర్శకు డైనట్లు కనిపించును.

ఈతని గ్రంథమునందు రచన యొచ్చటను పాలిపోక వెలిగాక పాఠకులకు విసుగు జనింపనీక చదివినకొలది చవులూరించి పాఠకులను రసతన్మయులను చేయును. ఆలోచనామృతమగు సాహిత్యము నాపాతమధురంగా పాఠకుల కందించి సహృదయులను రసజలధిలో నోలలాడించుట పితామహునకు తప్ప వేరొకరి కెట్లు సాధ్యము?

ఈ ఆంధ్రకవితాపితామహుడు శ్రీనాథుని పెక్కుచోట్ల అనుసరించినను తన వాడే యని కాబోలు పేరునుకూడ ప్రస్తావించలేదు.

'ఆంధ్రకవితా పితామహ' బిరుదము కేవలము పెద్దనార్యునకే కాక మరికొందరి కున్నట్లు వావిళ్ళవారి ముద్రణపీఠిక యందు గలదు. కాని పెద్దనకు పూర్వము, పెద్దనకు అనంతరము నీబిరుదు నలంకరించిన వా రున్నప్పటికిని పెద్దనకు వచ్చిన వ్యాప్తి వారి విషయమున మృగ్యము.

'ఆంధ్రకవితా పితామహుడు' అనగానే సాహితీప్రియంభావుకులకు పట్టుపంచలు కట్టి, నిట్టనిలువున పసిడికమ్మల పట్టుపచ్చడమును ధరించి, కర్ణకుండలములతో, కరకంకణములతో ఎట్టఎదుట దర్శన మిచ్చునది అల్లసాని పెద్దనార్యుడే!

— + —

# రతిమన్మథ సంవాదము

- శ్రీ పి. ఎ. వి. వల్లభాచార్యులు.

కవిరాజశిఖామణి నన్నెచోడదేవుని 'కుమారసంభవ' కావ్యము శివోత్కర్షను సూచించునది యని యెల్ల రెఱింగినదే. శివపారమ్యము స్థాపించుటకాయన కాళిదాస మూలమునకు గొన్ని మార్పులు చేసినాడు. ఆది మన తెలుగుకవులలో సాధారణముగా కానవచ్చు లక్షణమే. అట్టి చేర్పులలో చతుర్థాశ్వాసాంతర్గత మగు రతిమన్మథ సంవాదము పరిశీలించుట ప్రస్తుత వ్యాసోద్దేశము.

సురపతి మదనుని రావించి, పరమేష్ఠి వచనానుసారము కుమారోదయము, తద్ద్వారా తారకాసురవధ జరుగవలెను గావున పార్వతీ పరమేశ్వరుల కన్యోన్యానురాగము కలుగజేయు మని కోరిన నాత డంగీకరించువేళ నిట రతీదేవి 'కంతకంత కద్భుతములు దుర్నిమిత్తములు పుట్టుచు నోలి నిజాంగసంగతో, ర్జిత భయదాద్యశుభచేష్టల కెంతయు వెంగలించి దుఃఖిత' యయ్యెను. అంతలో _

'అలిగానము మదకోకిల
కలరావా (నాదా) తోద్యమును
శుకస్వన ఘనమం
గల పాఠరవము భోరనఁ
జెలఁగఁగ రతిఁ గానవచ్చెఁ జిత్తజు
డెలమిన్'

అ ట్లేతెంచిన పతిని జూచి 'యంతర్గత ఖేదం బెలమి మఱుపుగా నిడి కాలోచిత వచనాంతరముల సుర, పతి కడు వెస నిన్ను నేమిపని రాబనిచె' న్నని యడిగినది. మన్మథు డామె ముఖవికారముఁ గని చిఱునవ్వుతో 'నీ మది నింత దల్లడం బొదవు టేదేని కారణము కొమ్మలి! నా కెఱిగింపు మేర్పడ' నని నాడు. ఆమె 'దివ్యాంతరిక్ష భౌమాంగికాద్యనేక దుర్నిమిత్తంబులు నిర్నిమిత్తంబ పుట్టు' టెఱింగించి దీనానన యగుచు నీ పోయివచ్చిన కార్యం బెఱింగింపుమన్న 'బెద్దయు విశేషంబులేదయ్యుమామహేశ్వరుల తపోభంగంబు సేయుమనిన దానికి నెయికొని వచ్చితి ననిన విని రతి యదరిపడి యుల్లంబునం దల్లడిల్లుచు' నిట్లు మందలించినది.

మన కులదైవ మన్న గౌరవము లేకపోయిన త్రిభువనారాధ్యు డన్న లెక్కలేక, పరమయోగి యన్న భక్తి లేకున్న సర్వేశ్వరు డన్న శంక లేక, బ్రహ్మ శిరోదళను డన్న యదరు లేకున్న కాలారి యన్న భయము లేక, విషమాంబకు డన్న బెదరు లేకున్న ప్రళయాగ్నిరుద్రు డన్న భీతి లేక, యట్టి యుగ్రుపై నిన్ను పంపెను. అతని నెదిరించిన నీకు క్షేమ మున్నదా? ప్రధానవైరాన మరణంబు ధ్రువ మనంగ వినడె దివిజవిభుడు? ఆలోచింపక అతడు పంచిన 'పూన్కి కాడవై పొడువంగబోయె దీవు. నొక పోటరిమాటవ నీకు నక్కడన్ మృడు డొక యెల్లిగుం డకట' యనుచు దనలోని యనుమాన మీరీతి వ్యక్తము చేయుచున్నది.

'ఆనాకంబున గల య
మ్మానిను లందఱును నీకు మన
మిడియున్నం
దాని సహింపక సురవిభుఁ
డీ నెపమునఁ జంపదలచి యీపనిఁ
బంచెన్,

స్వర్గస్త్రీ లందఱు మనసిజుని యెడ ననురక్తులగుట సహింపని సురపతి యా

తడు నశించుటకై యీ పనిఁ జెప్పెనట. అంతియేకాదు –

'నినుఁ జూచిన కన్నుల సుర
వనితలు తనుఁజూడకున్నవాసవు డలుకం
జని చావని పంచినఁ జాఁ
జనునే యాతని చలంబు సాధ్యము
గాఁగన్'

మదనునిఁజూచిన కన్నులతో సురవనితలు తనను జూడకున్న నలుక జెందిన వాసవు డిట్లు చచ్చుటకు బంపిన నాతని కోరిక తీరునట్లు పోయి నశింతువా? యని యడుగుటలో నాత్మవిభుప్రశంస, వాసవునెడ క్రోధానుమానములు స్త్రీసహజ లక్షణములుగా ప్రకటించినది. అదియును గాక దేవతలు చెప్పిపంపిన దాని నొక గొప్ప యనుకొని దేవదేవు నెల్లిదముగ 'ప్రాణగొడ్డమా డెదుమదినోటకండ జెప్పి, సెడి డెప్పరికంబులు సేసె దిట్టి క్రొవ్విదములు దక్కి మీ పలుకు విష్ణుఁడు లక్ష్మియు విన్న మెత్తురే' యని యాతని తల్లిదండ్రులను గుర్తుజేసినది. 'రుద్రు నుఱుకనైఁ జని చెనయుట శిఖిశిఖల మిడుత చెనయుటగాదే' యని హెచ్చరించినది.

అంతట శృంగారయోని యిట్లను చున్నాడు. 'నేను సుమబాణము లేయ గౌరీశంకరుల చిత్తములు కరగి కూడును. సందియ మేల? 'వారి మేనుల న్మానుగఁ గూర్తు నొక్కటిగ మార్గణకౌశల భావమేర్పడన్' జగమందున నాయాజ్ఞ తిరుగు లేని దని నీవెరుగుదువు. భుజంగభూషణు నొక 'పోటుగొంగ' జేసి, యింత భయమంద నేల? యని తారతమ్య విచక్షణత లేక పల్కు నాతనితో రతీదేవి పరమేశ్వర మహత్త్వము నిట్లు చెప్పుచు, మన్మథుని యల్పత్వము బయటపెట్టినది

'ఆతని విల్లు కనకాచలము. నీది చెఱకుగడ, ఆతని బాణము పాశుపతము. ముట్టుకున్న కందిపోవు పువ్వులు నీ కమ్ములు. ఆతడు పురాపహారి. నీవో విరహాతుర పాంథజనాపహారివి. నీవు నాతనికి 'హస్తిమశకాంతర మెమ్మెయి చూచినన్' ఈశ్వరుని ధ్యానించు మహాత్ముల హృదయముల చలింపజేయలేని నీ మృదు పుష్పకాండ నికరమా మహనీయుని భేదింప నోపునే?' ఇట కవిరాజశిఖామణి గూర్చిన మతియొక చక్కని పద్యమున్నది.

'ఆటదాన నబల నైన నే నించుక
యలిగి చూచుడును భయము వదలరు
ఉగ్రు నుగ్రలోచనోద్భూతవహ్నికి
నెదిరి నిలువ నావు నెంత కోలఁది'

అబల, ఆడుది, యైన రతీదేవి యలిగి చూచిన బెదరువా డట్టి యుగ్రునుగ్రలోచనోద్భూతవహ్ని కెదిరి నిలువగలడా? అంతియకాక యాతని మూలబలము నీ విధముగ పరిహసించుచున్నది.

'కొనిబాలురైనను దిని పిప్పియుమిసెడు
చెఱకు విల్లని నమ్మి చేతఁబట్టి,
మెలఁతల తలవెండ్రుకలఁ బొందికందెడు
నలరు పువ్వము లమ్ము లని తలంచి,
తలిరాకులైనఁ గదల్పనోపని మంద
పవనుండు నొక పెను ప్రాపుగాఁగ
నబలలుసోపిన నాకాశమున బాఱు
నలిశుకములు మూలబలము గాఁగ,
నెంత వేసవి ముట్టిన నెండఁగమరు
నను వసంతుండు దగ సహాయంబుగాఁగఁ
గాకిపిల్లలకోడు పికములుఁ బోటు
మగలుగా నుగ్రుపైఁ బోవఁదగునె మదన'

అనియాతని యల్పత్వము సూచించి యింకను 'చర్మ మొలిపించుకొన్న నరసింహునికన్న పెద్దవాడవా? (ఉత్తర నారసింహ పురాణగాథ). తలదెగిన బ్రహ్మకన్న గొప్పవాడవా? కాల్పువడ్డ యమునికన్న శూరుడవా'యని ప్రశ్నించి, పరమేశ్వరు నిట్లు ప్రస్తుతించినది.

'హారికంకాలము చేతిముద్ర దివిజేం
ద్రాస్థుల్ సుభూషావళుల్
గరళం బభ్యవహార మంతకతను
క్షారంబు మైపూఁత పం
కరుహాసీన శిరఃకపాల మురుభి
క్షాపాత్రగా విశ్వసం
హారువర్తించు మహావ్రతోపహతి సే
యంబూన నీప్రాప్తియే'

శైవ భేదములలోని 'మహావ్రత' సామగ్రిని కవి యీపద్యమున సూచించినారు. శివపారమ్యము నే ప్రతిష్ఠించుట యీతని ముఖ్యోద్దేశముగదా! ఇచటనే కాక కుమారసంభవము' నం దెడనెడ రసవాద శైవము, నవనాథ సంప్రదాయము మున్నగు భేదములు వర్ణింపబడినవి. అది యట్లుండ నిండు.

రతీదేవి పరమేశ్వరు నెదిఁగింప మదనుడు; బలపరాక్రమాతి ధైర్య శౌర్య మహామంత్రతంత్ర ధ్యాన ధారణైశ్వర్యాద్యశేష దివ్యశక్తు లెంత విశేషంబులయ్యును చంద్రకిరణములకు నిందుకాంతశిలలు కరగునట్లు కోమలంబైన కామశక్తికి లోనై మృదుభావంబును పొందునని కామశక్తిని స్పష్టపరచును.

'అదిమి పట్టినఁ గరులైనఁ జదియునట్టి
కడిఁది బలులైన మగ లొత్తి కౌగలింపఁ
గుసుమ కోమలులగు సతుల్, కొసరుచునికి
గనియు నెఱుఁగవె విపరీత కామశక్తి.'

చెప్పినవాడు శృంగారరస రాజ్య సమ్రాట్టు మన్మథుడు. చెప్పినది తన యింతి రతీదేవికి. అంశము విపరీత కామశక్తి. పద్య మింక రసికజన మనోహరము గాక యేట్లుండును? అదిమిపట్టి యేనుగుల నలిపివేయుగల బలవంతులైన భర్తలు బిగియార కౌగలించిన కుసుమ కోమలులగు సతులు కొసరుచుండు రన్న కామశక్తి కింతకన్న తార్కాణ మేమున్నది? దానికి హేతువుగా బ్రహ్మ తన కిచ్చిన వర మిట్లు ప్రకటించినాడు.

'ఆరయఁగా స్త్రీ పురుషా
కారములై చిత్తవృత్తిఁ గలిగినఁ జాతుల్
వారెల్లఁ గామవశులగు
వారని నియమించి నాకు వరమజుఁడిచ్చెన్'
అని 'యాదిసృష్టికిని గారణంబైన కామ
తత్త్వ మహాత్త్వంబుఁ దెలిపి రతి నోడం
బఱచి రతీశ్వరుండు పరమేశ్వరుపైఁ
బోవ నుద్యుక్తుఁ డగుడు' నని నన్నెచోడుడు
డీ రతిమన్మథ సంవాదము ముగించినాడు.

ఎట్టకేలకు రతి నొప్పించినను, యీ మె పాత్రచే నన్నెచోడుడు స్పష్టపరచిన శివపారమ్యము, పురారి మన్మథుల శక్తి భేదములు ప్రశంసనీయములే గదా! భర్తృశ్రేయైక వాంఛాపరురాలుగా రతీదేవిని, దేవతాసుఖదాయక, కాంక్షిగా మన్మథుని తీర్చిదిద్దినాడు నన్నెచోడుడు. శంకరుని తత్త్వమెఱిగినజ్ఞానవతిగా రతీదేవిని చిత్రించి,తనభావములు బహుసుందరముగా ప్రకటించినాడు. రతీదేవి యింద్రునిపై చేసిన యారోపణము, మన్మథుడు కామశక్తిని ప్రశంసించువిధము రమణీయములు గావా? మూలమునలేని యీ భాగము కావ్యమునకు మరింత శోభనుగూర్చునదే కదా! ఇట్లే నన్నెచోడుని 'కుమారసంభవ' కావ్యమంతయును బహుసుందర భావ పుష్పవిరాజితమైనది. రసికసహృదయ పాఠక భృంగములకే తన్మధువందును.

—+—



# ఆంధ్రకవులు - అభ్యవహార పద్ధతులు

- 'భాషాప్రవీణ' శ్రీమతి కె. వి. రంగనాయకి, ఎం. ఏ.

నియతి కృత నియమ రహితాం
హ్లాదైకమయీ మనన్య పరతంత్రామ్।
నవరస రుచిరాం నిర్మితి
మాదధతీ భారతీ కవే ర్జయతి
(ఆచార్య మమ్మటః)

కావ్య సాహిత్యమును నిరంతరాయముగా పరిశీలించుచున్నచో ప్రాచీన వివిధ నాగరికతా విశేషములు బహుధా భాసించుచుండును.

ప్రాణులకు సుఖములయం దున్నంత మక్కువ దుఃఖముల యందు శూన్యము. అసలా యనుభవమే స్మరింపరాదు. తానుగానైన స్మరణకు రారాదు. ఇది సామాన్యముగా ప్రాణిధర్మము. భగవద్గీతానుభవముతో పండిన వేదాంతుల విషయమును నేను భావింపలేను గాని సామాన్యముగా నందరికీ సుఖానుభవమున మాత్రము వాంఛ అధికముగా నుండుట సంభావ్యము.

ఆసుఖము బహుధా భిన్నముగా నుండును. కొందరు ఐశ్వర్యము,రూపము, ఆయువు, సంతానము, విద్య, మొదలుగా వారి సంస్కారము ననుసరించి కోరికను కోరుచుందురు. కాని భోజన విషయమున మాత్రము దొరకినంతలో సంతుష్టిగా భుజించుటను అందరును కోరుకొందురు. మానవులకే కాదు. ప్రాణికోటి కంతకును ముఖ్యము ఆహారమే కదా! తైత్తిరీయమున బ్రహ్మ పదార్థమును బోధింపుమనగా 'అన్నం ప్రాణం చక్షుః' అని అన్నరూపమైన బ్రహ్మనే మొట్టమొదట ప్రవచించినారు భృగువునకు.

తస్మా ద్యయా కయా చ విధయా బహ్వన్నం ప్రాప్నుయాత్, అన్నం న పరిచక్షీత,'అన్నం బ్రహ్మేతివ్యజానాత్' మొదలుగా నుపనిషన్మూర్తి అన్న సంపాదనమును గూర్చి చెప్పుచున్నాడు.

'ఆత్మార్థం న పచే దన్నం' అని ధర్మశాస్త్రము స్వోద్దిష్టమైన అన్నపాకమునే నిషేధించు చున్నది. కాగా అతిథి సత్కార పూర్వకముగా అభ్యవహారమును ఆచరించుట మన కావ్య సామాన్యమునందు గోచరించు చున్నది. కాగా దేవతార్చనమున స్వాభీష్ట దైవతమునకు మహా నావి ర్నివేదనము నందు జాగరూకులై సంభారములు సేకరించి వంటకములు చేయించుటయును; బంధుజనసమాగమములందు పర్వదినములలోను, ఉత్సవాదుల యందును ఈ భోజనాది వ్యాపారమును; స్పష్టముగా ప్రతీతమగుచున్నది.

పితృతిథులందును 'అన్నం చ పాయసంభక్ష్యం వ్యంజనం' మొదలుగా వరుస చూపిననేగాని భుజింపరు గదా! అనగా మనము చేయు ఆతిథ్యమును అంత జాగ్రతగా కావింపవలె ననుటయే పరమార్థము.

తరుణం సర్షపశాకం
నవౌదనం పిచ్ఛిలాని చ దధీని।
అల్పవ్యయేన సుందరి!
గ్రామ్యజనో మృష్ట మశ్నాతి॥

జనసామాన్యమైన అన్నవాంఛను పురస్కరించుకొని కవి ఒక సుందరిని పలుకరించు చున్నాడు. భోజుని ఆస్థానములో కవిత్వము చెప్పుచున్నట్టుగా నున్న

భోజనం దేహి రాజేంద్ర!
ఘృతసూప సమన్వితమ్।
మాహిషం చ శరచ్చంద్ర
చంద్రికాధవళం దధి॥

ఈదధి యందు ధావళ్యమేగాని పిచ్ఛిలత లేదు. పిచ్ఛిలమైన దధి కాని తుష్టికర్హము గాదు.

పురాణములయందు ఆతిథ్యమహిమ చాల విశేషించి చెప్పినారు. అభ్యవహార మనగా ఆతిథ్యవిశేష మనే భావన చేయవలెను.

ఆంజనేయుఁడు సీతా విరహాపర్యుత్సుకుఁడైన శ్రీరామ చంద్రుని గూర్చి సీతాదేవితో ఇలా అనినాఁడు'
'న మాంసం రాఘవో భుంక్తే
న చాపి మధు సేవతే।

బాణ భట్టు చాల విధములైన భోజనములను చెప్పినాడు.

కాళిదాసు విశేషించి యెక్కడను అభ్యవహార పద్ధతిని గూర్చి చెప్పినట్లు లేదు. ఆయన కేవలము భోజన ప్రియుఁడు మాత్రమేకాదు. కాశ్మీరము, ఏలా లవంగ జాజీ, తక్కోలములు, చందన జ్యోత్స్నాదులు, కలువలు, తామరలు, వంటివే యిష్టములైనవి. అడవులు, నదులు సరే సరి, ఋతువులలో వర్ష ఋవే.

భారత భాగవత రామాయణ గ్రంథములందు, యజ్ఞయాగాదుల సమయముల లోను ఉత్సవాదు లందు అన్నరాసులనే వర్ణించినారు. కాని దానికి వ్యంజన వైవిధ్య విషయమును మాత్రము అంతగా ప్రస్తావించ లేదు ఇక భక్ష్యములు మోదకములు మాత్రమే అక్కడక్కడ ఉత్సాహాతిశయ ద్యోతకములుగా నున్నవి.

సంస్కృతి కావ్య సాహిత్యమునందు రూపకములలో భోజన ప్రసక్తి విదూషక విషయముగా నున్నను అది హాసమాత్ర జనకమై యున్నది. ఆంధ్ర కావ్యములందు ఈ అభ్యవహార పద్ధతిని విలక్షణముగా చూడవచ్చును.

కవిత్రయము వారిలో ఆహారప్రియత్వము, శ్రద్ధ ప్రత్యేకముగా కనుపింపవు. వారు స్వహస్తపాకులు గదా! కాని నన్నయ నిరతాధ్యయన తత్పరుఁడైనట్లుగా తిక్కనయు నిరతాన్న దాతయే. ఎఱ్ఱన ఆతిథ్యమును విజ్ఞానమయముగా భావించిన యోగి.

నన్నెచోడ మహాకవి కుమారసంభవము నందు కొన్ని విందులు చెప్పినాడు. కాని అవి ఆటవిక సామాన్యమైన దుంపలు, తేనెలు మున్నగునవి మాత్రమే.

ఆ తరువాత శ్రీనాథకవి సార్వభౌముని యొద్ద నుండి భోజనవిషయమును, పిండి వంటకముల విషయమును మనము తృప్తిదీర ఆస్వాదింపవచ్చును. భోజనమునకు కావలసిన అరటి యాకులు ఇలా యుండ వలయు నట.

'మొగి విరిసి కఱకుగూడక పగులక వెడలుపును నిడుపుఁ బనిమియుఁగల తే జిగురరటాకులు'

శ్రీనాథుని నిత్య భోజనావసరము లను పేమారెడ్డియో, వీరభద్రారెడ్డియో, విస్సన్న మంత్రియో ఎవరో యొకరు పంపెడివారు. ఆయాకులు చిన్నవిగా నుండరాదు. విస్తీర్ణములై మనోజ్ఞములై యుండవలయును. 'విస్తీర్ణం పత్రభోజనం' గదా!

శ్రీనాథ మహాకవి భోజన వ్యాపారము మహాచక్రవర్తి సామాన్యమైనది. అతనికి పురుష పాకము నచ్చదు స్త్రీలైన వితంతువులు పనికిరారట. పాప మాతనికి బాగుగా నిర్వేదమును గలిగించిన ఘట్టము

పళ్ళెరయించితి గోక చుట్టితి మహా
కూర్పాసముం దొడ్గితిన్
వెల్లుల్లిం దిలపిష్టము న్మెసవితి
న్విశ్వస్త వడ్డింపగా
జల్లాయంబలి ద్రావితిన్ రుచులు దో
సంబంచు బోనాడితిన్
దల్లీ కన్నడ రాజ్యలక్ష్మి! దయలే
నేను శ్రీనాథుడన్.

ఈ జరిగిన దుస్సంఘటనలో శ్రీనాథుని హృదయమునకు బాధాకరమైనది విశ్వస్త వడ్డనమే.

ఇక వివాహాదులందు బువ్వపుబంతి యిట్లున్నది. గోధూమ సేవికాగుచ్ఛంబు లల్లార్చి ఖండశర్కరలతో గలపి గలపి, గుజ్జుగా గాచిన గోక్షీరపూరంబు జమిలి మండెగలపై జల్లి చల్లి, మిరియంబుతో గూడ మేళవించిన తేనె దోరంపుల డ్డ్వాలు దోచి తోచి, పలుచగా వండిన వలిపెంపుఁజాపట్లు పెసరపప్పులతోడ పెనచి పెనచి; గోనజవ్వాది కస్తూరి గొరతపరచు, వెన్న పడిదెంబు జొబ్బిల విద్రిచి విద్రిచి, వారయాత్రికులను మోదవంతులగుచు, వలచి భుజియించి గొగ్గి బిండి వంటకముల.

ఇది అచ్చముగా పిండి వంటకములను మాత్రమే, భుజించు పద్ధతి. ఇక భోజన పద్ధతిని ఈతడనుభవించినంత సంతృప్తిగా నేమహాకవియు అనుభవించలేదేమో? ఆతనియనుభవము లన్నింటిని ఆతడు తన భీమేశ్వర పురాణములో చక్కగా వర్ణించి యున్నాడు. అప్పటి ఈభోజనమును ఇప్పటి మహారాజులుకూడ అనుభవించలేరేమో?

ఖండశర్కరలును కండచక్కెరలు దో
సెల్వడల్సైని పాసెముల తోడ
గమ్మగా గాచిన గరియాల నేతితో
గమనీయ పంచ భక్ష్యములతోడ
సంభారములతోడ శాకపాకముతోడ
బక్వమయిన పెసరపప్పు తోడ
దేనియధారతో పానకంబుల తోడ
శిఖరపాడబరస శ్రేణితోడ.
నప్పలవడాదికములతోడ నమృతఖండ
పాండరంబైన దధితోడ బ్రాహ్మణులకు
భోజనము పెట్టు ద్వాదశి పుణ్యవేళ.

ఆజ్యధారలు లేక వైశ్వానరుడు తృప్తి చెందడు. అదియును ఆలనేతి ధారలు. ఇది ఆనాటి బ్రాహ్మణుల భోజనము. ఇక్కడ విశేష మేమనగా వారి పాత్రములు సయితము హిరణ్మయములు. ఆపాత్రముల భోజనములు చేయుచు వారు మందహాసములు సలుపుచున్నారు. అవి సరిగా పాయసాన్నము లే.

భీమేశ్వర పురాణములో వ్యాసుడు శిష్యులకును తనకును భోజనము లభింపక ఏడు దినము లుపవాసముండి తుదకు కాశిని శపింపబోగా, అన్నపూర్ణాదేవి వారలందరకూ తృప్తిదీర భోజనము పెట్టినది. ఈసందర్భమున భోజనమునకు ముందు సలిపెడి సత్కార్యానుష్ఠాన సంప్రదాయమును కూడ పొందు పొసగినాడు కవి సార్వభౌముడు.

అరటి యాకులను పరచి బ్రాహ్మణ పంక్తికి గంధ పుష్పాక్షతముల నర్చనము సలిపి హారతు లిచ్చిరి. అనంతరము బ్రాహ్మణులు శాంతి పాఠములు ప్రవచించిరి. క్షుత్పిపాసాపరు లగు వారికి వండిన చొప్పును, పొగపు వాసనయు, బాగ పారు చందము కానరాలేదు. హృదయములు ఝల్లు మనినవి. నేడుకూడ ఈ పవాక్కు మేమో యని అనుమానాస్పదముగా ఆపోశనము పోసి అమృతమస్తు అనగా చిత్రముగా వారి యాకులలో అన్నపూర్ణాదేవి దివ్యకటాక్షవీక్షణముల

'పప్పును బెండి వంటలును
బాయసముల్ ఘృతముల్ గుడంబులుం
గుప్పలు గాగ జుట్టునను
గూర్పన గూడిన యేరు బ్రాలతే
లుప్పర భోగివంటకము
గమ్మని తాలిపుసాజ్జె పిండితో
నొప్పులుగా భుజించి విబు
ధోత్తము లాకటి చిచ్చు పెచ్చునన్.'

మడసోపేతమైన భోజనమును తృప్తిగా చేసిరి.

ఈపై చెప్పినవి బ్రాహ్మణ భోజనములు. పెండ్లి కొడుకు వంక చుట్టాలకు పెద్దతరగతి బంధువులకు మంచిబందేటి మాంసమును చేపలు, కూరను అమృతోపమానముగా వండి పెట్టినారట. వానిని తినువారు అహా! అమృతాయమానముగా నున్నదను మెచ్చుదలను శ్రీహర్షుడు స్వయముగా విని శ్రీనాథునకు చెప్పినాడు. అంతేకాదు అడవిపంది మాంసమును నిమ్మరసముతో నువ్వులనూనెతో వ్రేల్చినచో అమృతమధుర రసఖండములే.

అప్పటి పాకశాసనులు మాంసములు మాంసములు కానట్లుగను, అమాంసములను మాంసములుగను, భ్రమపడునట్లు చేయు పాక చక్యములు గలవారు.

జంగము దేవర్ల భోజన ప్రక్రియ వ్రతాచరణము, అతిథి సత్కారములను, వివరముగా హరవిలాసములో వివరించినాడు. అందులో మాంసమును ఏవిధముగా వండవలయునో దానిలో నేయేద్రవ్యములు వేయవలయునో ఈ విధముగా చెప్పియున్నాడు.

'మిరియము నుల్లియున్ బసుపు
మెంతియు నింగువ జీరకంబు శ
ర్కరయును జింతపండును గ
రాంబువు గమ్మని నేయి తైలమున్,
బెరుగును మేళవించి కడుం
బెక్కువిధంబులం బాకశుద్ధి వండిరి'

ఇది అమృత పాకమట. ఈశ్వరార్చన కళాశీలుం డగువానికి ఈభోజనప్రకియ ఎలా తెలిసినదో? సార్వభౌమతయే దానికి కారణము కాబోలు.

ఈపైపదార్థములను భుజించిన పిదప సుఖముగా జీర్ణమగుటకు పుల్లపెరుగుతో గావించిన యావపచ్చళ్ళను చవిచూచినారంటే. తినునంతటి యోపికయు నవకాశమును గూడ లేవు.

ఈ ఆవ పచ్చళ్ళపై గోదావరీ మండలము వారి కభిరుచి మెండు. నెల్లూరు గోదావరీమండలముల వారి భోజనప్రీతికిని కృష్ణా గుంటూరుమండలముల వారి భోజన ప్రీతికిని చాల తేడా కలదు.

తరువాత పానకములు, ఫలరసములు మొత్తముగా చెప్పినాడు. శ్రీనాథుని భుజిక్రియా చమత్కృతిని తిలకింపుడు.

చలివాలు నప్పు లడ్డువ
ములు, చన్నులు పనస తొనలు,
మోవులు మండెం
గలు, చీరలుగ భుజిక్రియ
వలపించెం బెండ్లివారి వనితయు పోలెన్.

వలపించు వనితయే యైనది.

ఇక తాంబూలసేవనము. అది కప్పురపు వీడ్యము. అంతేకాని వట్టి వక్కలాకులు నములుట గాదు. దానిలో పరిమాచికములు. ఈ పద్ధతి ఒకపూట మాత్రమే గాదు. మువ్పూట భోజనక్రమ మింతే. అనగా వారు బంధు ప్రకరమునకు, అతిథులకు పెద్దలకును గావించెడి విందు.

(సశేషం)

---

* ప్రభుత్వాస్థానకవి ఒక్కరేఉంటూండగా ప్రభుత్వాస్థాన సంగీతవిద్వాంసు లిరువురు నియమింపబడిరి.

* శ్రీ ఈమని శంకరశాస్త్రి, శ్రీ మంగళంపల్లి బాలమురళీకృష్ణ గాన విద్యలో ఒకరికి దీటైన వారింకొకరు. శ్రీ దాశరథికి దీటైన మహాకవి యింకొకరు కనబడక కావచ్చును.

# 'సంధ్య' నవల - ఒక పరిశీలన

- శ్రీమతి సావిత్రి, ఎం. ఎ., బి.యిడి.

సృష్టిని పరిశీలిస్తే అంతా అయోమయంగా కనిపిస్తుంది. ఏదిమనం ఆశిస్తామో అది దూరమవుతుంది. దేని విషయంలో మనం వద్దని అనుకుంటామో వద్దన్నా అది మనల్ని ముద్దెట్టుకుంటుంది. ధనమున్న చోట విద్యఉండదు. విద్యాశక్తి ఉన్న చోటడబ్బు దైవబలం అనుకూలంగా ఉండవు. ధనికుల ఇళ్లలో సంతానం కూడా ఉండదు. దరిద్ర నారాయణుల ఇళ్ళు వాకిళ్ళు వారిసంతానాలు కుచేలుడికి ప్రతిరూపాలు. అన్నమో రామచంద్ర అని వెన్నముక కంటుకుపోయిన కడుపుతో, పీక్కుపోయిన కళ్ళతో బావురుమని ఏడ్చేవాళ్ళు ముప్పావలా వంతు అయితే, కేవలం తిన్నది అరక్క ఎల్లాగ అరగించుకోవాలో తెలియక, ధనమైకంతో కళ్ళుపొరలు గమ్మి వినోదాలతో, విలాసాలతో, వక్రాలోచనతో తలపులు వెర్రితలను వేసేవారు పావలా వంతు.

'అదేమి చిత్రమో, సమాజంలో వీరి సంఖ్య చింతగింజలు చిమ్మినట్లు అక్కడక్కడ పలుచగనే ఉన్నా వీరి ప్రాభవం మట్టుకు ముప్పావలా వంతును మూడు చెరువుల నీళ్లు త్రాగించటమే సమాజంలో మనం చూస్తూన్న చిత్రం. పేదవారిని బ్రతకనివ్వరు. అలాంటి మదోన్మత్తురాలి కుపకారము చేయదలంచి వారనుండి తాను పొందిన స్వల్పమైన ఋణ పణాలకు విశ్వాసంతో కృతజ్ఞతను చూపాలనుకొని సంఘం దృష్టిలో దోషిగా రూపొందింప బడిన ఒక కన్య జీవితగాథయే 'సంధ్య' నవల.

శ్రీమతి మాదిరెడ్డి సులోచనగారు ఈ నవలను ఒక చక్కని మలుపులో నేర్పుతో సమాజం ముందర అద్దము పట్టినట్లు మలిచారు.

జానకమ్మ ఉత్తమురాలు. గుణవతి. రూపవతి. ఆమె అందచందాలకు ముగ్ధుడైన రఘుచంద్ర అనే ఒక జమీందారు కుమారుడు ఆమెను వివాహం చేసుకుంటాడు. ఆ అమ్మాయికోసం, ధనధాన్యాలు అన్నీ త్యాగం చెయ్యవలసి వస్తుంది. తండ్రి జమీందారు రఘుచంద్ర తన వంశ గౌరవాన్ని మంటకలిపే డన్న నెపంతో ఆస్తి యివ్వనన్నాడు. నూతన దంపతులు రెక్కలు తోడు చేసుకొని విశాలప్రపంచంలో అడుగు పెట్టేరు. జమీన్లు చూసుకోవడం అనే నాజూకు పనితప్ప కాయకష్టం చేయడము తెలియని రఘుచంద్రకి ఏఉద్యోగమూ రాదు. జానకి చేసే చిన్న ఉద్యోగంతో కాలం గడుపుతారు. అతనికి దొరికిన ఉద్యోగపు తృప్తిని పొందక పూర్వమే అతని ఆరోగ్యము దెబ్బతింటుంది. గర్భవతియైన జానకమ్మ ఆడ కవలపిల్లలను ప్రసవిస్తుంది.

ఆమెప్రక్క మంచముపై ఒక ధనవంతుని భార్య ప్రసవించింది. పేరు ఇందిరమ్మ. పుట్టిన శిశువు మరణించింది. ఈసారి పాప నెత్తుకురాకుంటే ఆమె భర్తకు మరో వివాహం చేస్తానని అత్తగారు బెదరగొట్టింది. తన కాపురం పోతుందని చనిపోయిన శిశువును తల్చుకుంటూ రోదించింది ఇందిరమ్మ. ఆనాడు తనభర్త వేణుగోపాలరావు పాపని చూడటానికి వస్తాడని తెల్పి ఆకష్టాన్ని గట్టెక్కించమని ప్రాధేయపడిన ఇందిరమ్మ కోరిక కాదనలేక పోయింది. జానకమ్మ. తన పక్కలో నున్న పాపల్లో ఒక పాపని తాత్కాలికంగా ఆమె చేతిలో పెట్టింది. కష్టాన్ని గట్టెక్కించిన జానకమ్మ సహృదయతాన్ని కొనియాడకుండా ఉండలేక పోయింది ఇందిరమ్మ. వేణుగోపాలరావు వెడలి పోయిన తరువాత పాపని తిరిగి ఇవ్వబోతూ ఆమె పడిన వేదనను అర్థంచేసుకున్న జానకి భర్త అనుమతితో ఆ చిన్న పాపను వారికి దత్తత కిచ్చేసింది. ఈ విషయం జానకమ్మ, ఇందిరమ్మల మధ్య పరిమితమయింది. ఇచ్చి పుచ్చుకోవడాలలో ఇద్దరిహృదయాలు సన్నిహిత మయ్యేయి. ఇందిరమ్మ హృదయం ఆనందంతో ఉప్పొంగి పోయింది.

కథాగమనంలో అనారోగ్యానికి గురియైన రఘుచంద్ర, ఆతరువాత కొంత కాలానికి, జానకమ్మ, మరణిస్తారు.

లక్షలకువారసురాలుగా పెరుగుతున్నది సుధ. తల్లి చనిపోయిన సంధ్య అనాథ అవడంతో ఇందిరమ్మ తన ఇంటికి తీసుకెళ్ళింది సంధ్యను వారి మధ్యగల బంధుత్వం సంధ్యకు తెలుసు. సుధకు తెలియదు. సుధ డబ్బువిచ్చలవిడిగా ఖర్చు చేస్తూ, ధనలాలసత్వంతో అశోక్ అనే అబ్బాయితో స్నేహం చేస్తుంది. ఆ ధనాశ ఆమె కన్నుకప్పింది. దారి తప్పింది. అనాథ అయిన సంధ్య జీవితంలో అడుగడుగునా కష్టాలనే ఎదుర్కోవలసి రావటం చేత జీవితం ఓర్పునీ, ఓదార్పునీ, త్యాగాన్నీ నేర్పింది. పెళ్ళికాకుండా తన చెల్లెలు కనిన శిశువుకు తాను తల్లిగా, మారి శిశువును చేర్చుకుంది. నింద తనమీద వేసుకుంది. తనచుట్టూ ఎవరూ లేరు. కాని సుధజీవితం అల్లాకాదు. ఆమెయే సర్వస్వ మని ప్రాణానికి ప్రాణాన్ని పణంగా పెట్టే తల్లి తండ్రులు, ఉజ్వలభవిష్యత్తు, అంతస్థుకు తగ్గ హోదా, అన్నీ ఉన్నాయి. తన చెల్లెలి చదువుకు, డబ్బుకు, స్థానానికి లోటురాకుండా కాపాడి సంఘంద్వేష్టాక్షి తను నేరస్థురాలయింది. లోకం నిందల ఉక్కుగోళ్ళతో తన్ను రక్కుతున్నప్పుడు, తనను వరించిన ప్రియుడు తన చెల్లెలు సుధను పెండ్లాడ దలచినప్పుడు కూడా అగ్నికుండాన్ని కడుపులో నే కమ్ముకుందితప్ప నిజంచెప్ప ప్రయత్నించ

నైనా లేదు. ఆవిధంగా సుధ జీవితాన్ని కాపాడుతూ అంత్యావస్థలో తన తల్లి కిచ్చిన మాట నిలుపుకుందుకు తాను బలై పోయింది చివరకు వెక్కిరించిన ఆ విధే ఆమెకు ఆనందాన్ని దక్కించింది. ఆమెతో సహోపాధ్యాయుడుగా పని చేస్తున్న శ్రీరామ్ ఆమె జీవిత గాథను చదివిన తరువాతకూడా ఆమె ఓర్పును కొనియాడి, చెదరని మనస్సుతో, ఆమెను వివాహమాడతాడు.

స్త్రీలందరిలాగే తాను ఒక సామాన్యమైన జీవితాన్ని గడపడానికి ఇన్ని ముళ్ల కంచెలు దాటవలసివస్తుంది సంధ్యకు.

'సంధ్య' కథేతివృత్తాన్ని మలచటం కోసం రచయిత్రి తీసుకున్న పాత్రలలో సుధ-ప్రకాష్ - అశోక్ పాత్రలు ముఖ్యమైనవి. జానికమ్మ, ఇందిరమ్మ, వేణుగోపాలరావుగార్ల పాత్రలు మాధ్యమిక పాత్రలు. ఇక సంధ్య పాత్రప్రాముఖ్యం పుస్తకనామధేయంగా పెట్టడమునుబట్టే గ్రహించవచ్చు.

జానకమ్మ,ఇందిరమ్మలు ఇద్దరూ ఇంచుమించు ఒకే దృక్పథంలో చిత్రింపబడ్డారు. ఇద్దరూకూడ రూపవతులే. గుణవతులే. ఇద్దరూ ఓర్పు, నేర్పుగలవ్యక్తులే. జానకమ్మ ఆర్థికంగా కష్టాలనుభవిస్తూ బాధపడుతున్నా ఎదుటివారుఅనుభవించే సౌఖ్యాలు - సుఖాలపట్ల ఏపాటి ఈర్ష్య లేని సహృదయురాలు. తన కవలపిల్లలలో ఒకఅమ్మాయిని ఇందిరమ్మకిచ్చింది. వారిద్దరూ అభిమానంగా ఒకరికొకరు ప్రత్యుపకారంగా ఉంటూ వుంటారు. జానకమ్మ వ్యాధిగ్రస్తురాలైనపుడు వైద్య సహాయం చేయిస్తుంది ఇందిరమ్మ. అంతే కాదు. జానకమ్మ మరణానంతరం సంధ్యను తన యింటికి తీసుకెళ్లి కష్టంలో ఆదుకొంటుంది. తన కాపురాన్ని నిలబెట్టి బిడ్డచేత 'అమ్మా' అని పిలిపించుకుందుకు తల్లిగా అనుభూతినిపొందటానికి సహాయపడిన జానకమ్మపట్ల ఆమెకు ప్రేమాభిమానాలు. ఈ ఇద్దరి పాత్రలు నిండుగా చిత్రింపబడ్డాయి. ఇందిరమ్మలో డబ్బుగల హోదా, దర్జా, వస్తువులు, చీరలు, అలంకరణ మెండుగా వర్ణింపబడ్డాయి. డబ్బుగల వ్యక్తి అయినా గర్వం లేకపోవటం ఈ పాత్రలోని గొప్పతనం. కృతజ్ఞత, దయ, పరోపకారం, ధర్మానురక్తి, సంస్కృతిపట్ల గౌరవం ఉన్న వ్యక్తిగా ఎడనెడ వర్ణింపబడుటచే ఉత్తమపాత్ర చిత్రణ అనుటలో అతిశయోక్తి లేదు.

అశోక్ చదువులేనివాడు. డబ్బు కొద్దిగా ఉంది. తాత తండ్రుల పేరుతో జీవితాన్ని గడిపెయ్యాలని ఆశించే సోమరి. ఆడువారు తెచ్చే కట్నంతో తాను స్వేచ్ఛగా తిరుగుతూ జీవించవచ్చని ఆశించిన మగసిరిలేని పురుషాకారము. తను స్వేచ్ఛగా తిరిగి 'సుధ' జీవితంతో ఆడుకొని, అనుభవించి, ఆమె గర్భవతి యని తెలియగానే సుధను దూషించి, వేరొక అమ్మాయిని పెండ్లి చేసుకున్నాడు. జాలి, దయ, సద్భావాలు ఏకోశాన లేని దుష్టుడు. 'సుధ' జీవితం వక్రించడానికి, ఆమె అవివాహితగా ఉన్నపుడే తల్లి కావటానికి, సంధ్య ఆ పిల్లవానిని తన అక్కున జేర్చుకుని పెంచుతూ సమాజందృష్టిలో దోషిగా పరిహసింపబడడానికి - ఇంత అననేల - సంధ్య నవల కథేతివృత్తానికి అశోక్ పాత్ర ప్రతినాయక పాత్రవలె పోషింపబడింది.

ఇటువంటి పాత్రలు నేటి సమాజంలో సజీవంగా తిరుగాడుతూ తరచు మనకు ఎదురౌతూనే ఉన్నాయి. ఈ విధంగా మోసంచేస్తూ, కన్నెపిల్లలను వక్రగతులు పట్టించే బూటకపు ఆకర్షణ కాల మిది. దానిని రచయిత్రిగారు నేర్పుతో చిత్రించి సమాజానికి అద్దం పట్టేరు. నేటి సమాజంలో ఇవి సామాన్యంగా ఎదురయ్యే విషయాలు. హద్దుమీరిన కాలం.

ప్రకాష్ వేణుగోపాలరావుగారి మేనల్లుడు. చిన్నప్పటినుండి సుధనిచ్చి పెళ్ళి చేద్దా మనుకున్నారు. కాని ప్రకాష్‌లో కొన్ని ఉన్నతభావా లున్నాయి. ఆ దృక్కోణంతో చూసే ప్రకాష్ సుధని అంగీకరించలేదు. సుధ అహంకారం, డబ్బుగర్వం, లెక్కలేని ఖర్చు - అదుపులేని తిరుగుడు, చదువుపై అనాసక్తి-అతనికి అయిష్టం.

సంధ్యలోఉన్న నిదానం, నిండుతనం, ఓర్పు, మాట నేర్పు, కష్టపడిపనిచేయటం అతన్ని ఆకర్షించేయి సంధ్యపై మరులు కొంటాడు. ఆమెని కష్టాలలో ఆదుకుంటాడు. అభిమానిస్తాడు. సంధ్యతల్లి జానకమ్మని పట్నం తీసుకెళ్ళి వైద్యం విషయములో సహాయపడతాడు. తల్లిలేని సంధ్యను ఆదరిస్తాడు. ఆమెను చదువుకుందుకు ప్రోత్సహిస్తాడు. ఇందిరమ్మగారి ఇంట్లో ఒక పనిమనిషిలా పనులుచేస్తూ ఉన్న సంధ్యను చూసి గిజగిజలాడిపోతాడు. సుధలో లేనివి, తాను కావాలనుకున్న గుణగణాలు సంధ్యలో చూచి ఆమెను వివాహమాడాలన్న తన కోరికను వ్యక్తంచేస్తాడు. సుధ పెండ్లిఅయ్యేవరకు ఆగాలని సంధ్య పెట్టిన కాలం గడువుకు అతను ఆగాడు. అనుకోని అవాంతరం అడ్డొస్తుంది.సుధ గర్భవతియై అవివాహితయే తల్లి అవుతుంది. ప్రపంచానికి తెలియనియ్యకుండా సంధ్య ఆదుకుంటుంది. ఈలోపం సంధ్యదే అని తలంచి చెప్పినది వినక, చెప్పుకోడానికి ప్రకాశ్ అవకాశమైనా ఇయ్యక, సంధ్యను నిందించి తిరిగి సుధనే పెండ్లాడుతాడు.

సామాన్యంగా పురుషులు అంతే. తామెన్ని తప్పుపనులు చేసివచ్చినా ఇల్లాలు గౌరవించాలి. ప్రక్క నేరూర్చుని వడ్డించి ప్రక్క పరవాలి. కాని తన ఇల్లాలు అనే స్త్రీ అరతప్పుచేసినా ఓర్చుకోలేదు.నిజానిజాలు తెలుసుకునే ఓరిమినైనా చూపడు.

ఈ జీవితసత్యాన్ని చక్కగా వర్ణించేరు రచయిత్రి.

ఇక సుధ పాత్ర కథాగమనానికి ఆయువు పోసింది. ఇలాంటి యువతులు నాగరికత పేరుతో సమాజంలో విచ్చలవిడిగా తిరగటం, నాగరికత పేరుతో అసభ్యంగా ప్రవర్తించడం, హద్దు అపు లేని ప్రవర్తన, నగ్నప్రదర్శన వస్త్రధారణతో మనకు కనబడుతూనే ఉన్నారు. దీనికి కారణం ఆలోచిస్తే కొంత సమాజంలో వచ్చినమార్పు, తల్లిదండ్రుల పెంపకంలోని లోపం, యువతరాన్ని రెచ్చగొట్టే సినిమాలు. సినిమాలు కేవలం ధనార్జనకై తోడ్పడే వ్యాపారసంస్థలన్నమాట మరచిపోయి ఆ సినీజీవితాన్ని తమ నిత్యజీవితంలో ఆచరించ ప్రయత్నిస్తుంది యువతరం.

తల్లితండ్రులు పిల్లల్ని పెంచేపద్ధతిలో కూడా పూర్వవిధానాలను విస్మరించేరు. సమాజంలో వచ్చే మార్పుల్లో పిల్లలను ఆటంకపెట్టకుండ పెంచటం, ఆంక్షలు విధించకపోవటం కూడా ఒక మార్పుగా తలుస్తున్నారు ఎక్కువమంది తల్లితండ్రులు. సమాజంలో ధనికవర్గం ఎక్కువగా ఉండి, అందరూ అదేవిధమైన సంస్కారాన్ని అలవరచుకునేవారుంటే పిల్లల్ని పట్టించుకున్నా లేకపోయినా అంత బాధ ఉండదు. మనదేశం అమెరికా జపానులవంటి నవనాగరిక దేశం కాదు. ఆ దేశాల్లో వయస్సులో వచ్చే కోరికలు, వాటిని యీడేర్చుకొందుకు చేసే ప్రయత్నములు - దగ్గరదారులు సర్వదా హర్షదాయకములు కావు. సుధలోని ఈ పోకడలను వేణుగోపాలరావు అభిశంసించకపోవటం తల్లిదండ్రుల బాధ్యతారాహిత్య ప్రవర్తన అనకతప్పదు. 'Spare the rod, spoil the child' అను సూక్తి ఎంత అనుభవముతో చెప్పినదో విదితమే.

యురోపియన్ దేశాలలో స్త్రీ ఎప్పుడూ మనకంటె అనేకరెట్లు స్వతంత్రులు. ఆమెకు పునర్వివాహం చేసుకునే హక్కు ఉంది. 'మనదేశంలో లేదా?' అనిపించవచ్చు. అది న్యాయశాస్త్రములోని స్త్రీహక్కుల జాబితా మట్టుకే పరిమితము. స్త్రీ ఈహక్కును ఉపయోగించుకొన ప్రయత్నించిన సహృదయతతో ముందుకువచ్చే పురుషులు ఎంతమంది ఉన్నారు సంఘములో? పశ్చిమ దేశాలలో పెండ్లికాని యువతి గర్భం ధరించిన దాని నొక పెద్ద విషయంగా అమ్మలక్కలు చెవికొరుకుంటూ చెప్పకోరు. పైగా అటువంటి వారికి పుట్టిన పిల్లలను దత్తత చేసుకుందుకు ఎంతోమంది ముందుకు వస్తారు. భారతదేశంలో నేటికి కూడా స్త్రీ అస్వతంత్రురాలు. ఆమె వంచింపబడినా తప్పు ఆమెదే. సమాజం దానికి 'రేగిముల్లు - అరిటాకు' సామెతను నిర్ణయించింది. భూతద్దంలో పరిశీలించి సంఘం ఆమెను దోషిగా నిరూపిస్తుంది. అందుకనే సంఘంలో ఏపురుషుడూ ముందుకి రాడు. మనసాంఘిక పరిస్థితులు అటువంటివి.

అందుకే 'టీన్ ఏజి-పదహారేండ్ల వయస్సులో' తెలిసీ తెలియని ప్రవర్తనలకు స్వేచ్ఛనిచ్చి, విచ్చలవిడిగా తమ కోరికలను తీర్చుకొనుటకు తగిన డబ్బును, పాకెట్ మనీలను ఇచ్చి, మగపిల్లలతో నాగరికత పేరుతో స్వేచ్ఛగా మాట్లాడే స్వాతంత్ర్యంఇవ్వటం తల్లితండ్రుల తప్పు. వారికి ఆ వయస్సులో అదుపు ఎంతేని అవసరం. అదుపులేని అమ్మాయికోరికలు గుర్రాల్లా పరుగెడుతాయి అలాగ అదుపు చేయనినాటి ఫలితముల ప్రతీకే యీనవలలోని సుధ పాత్ర. దీనిని రచయిత్రి 'ముంజేతికంకణము' అన్నట్లు ఈపాత్రను విశదీకరించి పోషించేరు.

రచనా సామర్థ్యము దృష్ట్యా వీరి నేర్పు ప్రశంసనీయం. చెప్పదలుచుకున్న విషయమును చక్కటి రంగులతో పాఠకులముందు అలంకరించి పెట్టడంలో వీరి నైపుణ్యం తెలుస్తుంది. కథ ఎత్తుగడ కూడా 'అనగనగా ఒకరాజు' అన్న ఫక్కీలోకాక flash back సిద్ధాంతంలో వివరించారు.

సంధ్య ఉపాధ్యాయురాలు. కష్టాల నెదుర్కొంటూ జీవితం గడుపుతూ ఉంటుంది. ఈర్ష్యాళువులైన కొంతమంది సహోపాధ్యాయులు ఆమెను నిందిస్తూ ఏమంకా ఆమెలో నిరూపించలేక ఆమె పెంచుతున్న పిల్లవాడు ఆమెకు పెళ్ళికాకుండానే పుట్టినట్లు దూషిస్తారు. కాని అదే స్కూలులో పనిచేసే శ్రీరామ్ అది నమ్మడు సరికదా సంధ్యపట్ల ప్రత్యేక గౌరవం చూపుతాడు ఆమెను పెండ్లి చేసుకుంటానన్న తన భావాన్ని సవినయముగా ఆమెకు విన్నవిస్తాడు. ఇదిమూడవ ఛాప్టరులో జరిగింది. తొందరపడవలదని వారించి, తనను గురించి నిదానంగా నిర్ణయాన్ని తీసుకోమని చెప్తూ 'ఈ పుస్తకమును చదివి నిర్ణయించుకోండి' అని ఒక పుస్తకం ఇస్తుంది. నాల్గవ ఛాప్టరునుండి శ్రీరామ్ చదివిన విషయం సంధ్య-సుధల జనన వృత్తాంతంనుండి చివరివరకు ఎట్లా సాగిందో-సంధ్య పెంచుతున్న పిల్లవాడు ఎవరో అన్న కథాగమనాన్ని శ్రీరామ్ చదవటంద్వారా పాఠకులకు తెల్పటం అయింది.

ఈవిధమైన శిల్పం యీ నవలకు ప్రత్యేకస్థానాన్నిచ్చింది. చెప్పిన మాటలు ఎవరూనమ్మరుగనుక జీవితాన్ని చదవటంద్వారా పాత్రపట్ల ఒక భావాన్ని నిర్ణయించుకోపడం సహజం. దూరం ఆలోచించి రచయిత్రి సంధ్య పాత్రపట్ల సానుభూతి చూపేటట్లు పాఠకుల హృదయాన్ని ఆకట్టుకొన్నారు.

—+—

# శక్తిభద్రుని సీత

- కుమారి నారపరాజు శ్రీవల్లి, ఎం. ఏ.

శక్తిభద్ర విరచితము 'ఆశ్చర్య చూడామణి' పూర్వరామకథకు సంబంధించిన నాటకము. రామాయణమునందలి ఆరణ్య, కిష్కింధా, సుందర, యుద్ధకాండముల కథ ఈ నాటకమునకితి వృత్తము.

ఆశ్చర్య చూడామణి రామనాటకము. కనుక ఇందలి నాయికానాయకులు సీతారాములు. సర్వసాధారణముగా కావ్యమున నాయకునకే ప్రాధాన్య ముండును. కాని, శక్తిభద్రుడు తన నాటకమున నాయికకు ప్రాధాన్యము నిచ్చినట్లు సూక్ష్మ పరిశీలనమున సువ్యక్తమగును. నాటక నామమే ఆవిషయమును వ్యక్తీకరించుచున్నది. చూడామణి సీతకు శిరోభూషణము. అంగుళీయకము రాముని ఆభరణము. ఈనాటకమున అంగుళీయక చూడామణులు ఋషిదత్తములు. మహిమాన్వితములు. వీటిని ధరించిన వారిస్వర్గ కామరూపులకు నిజరూపప్రాప్తి కలిగించును. అంగుళీయక చూడామణులు రెండును మహిమగలవియే యైనను శక్తిభద్రుడు తన నాటకమును 'ఆశ్చర్య చూడామణి'గ పేర్కొనుట నాయికా ప్రాధాన్యమును సూచించుచున్నది.

పాశ్చాత్యనాటకకర్తలలో పేరెన్నికగన్న షేక్స్పియర్ 'మేక్బత్' అను దుఃఖాంత నాటకమును రచించెను. అందు నాయకుడైన మేక్బత్ పతనమునకు అతని భార్యయైన లేడీమేక్బత్ కారకురాలు. నాటక మాసాంతము చదివినవారికి అందలి నాయికా ప్రాధాన్య మెరుకపడగలదు. షేక్స్పియర్ నకు కొన్ని శతాబ్దముల పూర్వుడయిన శక్తిభద్రుడు నాయికా ప్రాధాన్యము గల నాటకమును రచించెను. ఈ నాటకమున శక్తిభద్రుడు విలక్షణముగ సీతపాత్రను పరిపోషించెను. స్త్రీత్వమునకు ప్రతినిధిగ సీతను చిత్రించియు, కొన్ని తావులందు స్త్రీజన విరుద్ధములగు గుణముల నామెయందు పొందుపరచెను

ఆడది అనుమానమునకు మారుపేరు. కాని ఇందలి సీత అనసూయ. రామలక్ష్మణ తిరస్కృతయైన శూర్పణఖ దుస్థితి సీతకు బాధను కలిగించినది. వలచివచ్చిన శూర్పణఖను స్వీకరింపని రాముని సమర్థింపక పోగా అందుకు బాధపడినది సీత. స్త్రీ సహజమగు అసూయ శక్తిభద్రుని సీతలో సుంతైన కానము.

వివిధ రామాయణముల యందు కాని, ఇతర రామనాటకములయందు కాని మాయామృగార్థియై చనిన రాముని రక్షణకై సీత లక్ష్మణుని పంపుట కలదు. కాని ఈనాటకమున 'సీతే! త్వమపి మాముపేక్షసే!' అను కుహనా రాముని కంఠస్వరమును వినిన సీత ముందువెనుక లాలోచింపక రాముని రక్షించుటకై ఒంటరిగా బయలుదేరినది. రాముని రక్షణకై లక్ష్మణుని పంపుటతో శక్తిభద్రుని సీత మనస్సాగలేదు. అబల నని కాని, ఏకాకివని కాని ఆలోచింపక ప్రాణేశ్వరుని సాహాయ్యార్థము చనుదెంచిన తెగువరిగ శక్తిభద్రుడు సీతను చిత్రించెను.

- ఈసందర్భముననే లక్ష్మణుడు ఆశ్రమమున సీతను ఒంటరిగ వదలి వెడలుటకు శంకించుచుండగా 'సమాధీ రక్షతి స్త్రీజనః న బాణాః' అని సీత పలుకును. స్త్రీ పాతివ్రత్యమే స్త్రీకి రక్షగాని బాణములు కావను పలుకులు ఆమెను స్త్రీరత్నముగా నొనరించినవి.

సీత పతివ్రతామతల్లిక నుకనే మాయా రాముని రామునిగ భ్రమించినను అతని సాన్నిధ్యమున ప్రశాంతతను పొందలేక పోయినది. 2

రావణుడు రామరూపధారియై సీతను సమీపించును. సూతుడు లక్ష్మణ వేషధారియై మాయారాముని, సీతను చేరును. భరతునకు అపద వాటిల్లగా ఋషిజనము రథము ననుగ్రహించినట్లు మాయాలక్ష్మణుడు పలుకును. అది సత్యమే యని సీత విశ్వసించును. సీత కావిశ్వాసము కలుగుటకు కారణము లేకపోలేదు. పూర్వము మహిమాన్వితములయిన అంగుళీయక చూడామణులను ఋషులు లక్ష్మణున కొసగిరి. కనుక ఋషిజనానుగ్రహము ఆమెకు క్రొత్తకాదు. కనుక ఆమె మాయారామలక్ష్మణులను నమ్మినది. తక్కిన రామనాటకముల యందువలె గాక సీతను ప్రౌఢగా శక్తిభద్రుడు చిత్రించెను. రథము ఋషిదత్తమని మాయాలక్ష్మణుడు పలికిన వెంటనే ఆమె 'పూర్వము కూడ ఈతనికి ఆశ్చర్య చూడామణియు, అంగుళీయకమును ఇచ్చిరిగదా!' అని తర్కించుకొనుట ఆమెకు గల పరిశీలనాశక్తిని ప్రకటించును.

శక్తిభద్రుడు సీతను ధీరురాలినిగ చిత్రించెను. సీతకొరకు అంతఃపురస్త్రీల నయిన విడుతు నని పలికిన రావణునితో సీత నాకై నీవు జీవితమునే విడువవలసియుండునని హెచ్చరించును. రాముడు అతని ప్రాణములు హరించును. భీకరుడయిన రావణుని తృణప్రాయునిగ భావించినది. తన పాదములను తాకిన అతని శిరస్సులను తృణీకరించి మందోదరిచే ధీరురాలనిపించుకొనినది.

రావణాసురుని తలలు తన పాదముల నంటిన మాత్రముననే అపవిత్రురాలనైతినని తలచిన సాధ్వీమతల్లి శక్తిభద్రుని సీత. రామదూతగా లంకను చేరిన హనుమంతుడు సీతను కాంచి, రాముడామె కొరకై వేయిరెట్లు ఎక్కువ దుఃఖించినను తప్పులేదని భావించును.

సీత సచ్చారిత్రమును నీచులు దుర్మార్గులు, అయిన రాక్షసులును కొనియాడుట శక్తిభద్రుని రచనా విలక్షణతయే.

కాముకుడయిన రావణునకే సీతయందు నిర్మలత్వము గోచరించుట ఆమె సతీత్వమును ద్విగుణీకృతము నొనర్చుచున్నది. సీతను చూచిన రావణుడు 'కః కాలం శశినా మార్ష్టి ...' అనుకొనును. నిర్మలమైన చంద్రకళతో సీతను పోల్చుట మనోహరముగనున్నది. పూర్ణచంద్రుడు కళంకయుతుడు. నెలవంక వంక లేనిది.

సీతాపహరణ సమయమున రావణుని సూతుడు-

'ఇమాం గంభీర చారిత్రాం,
పశ్యామి పతిదేవతాం స
యయా నేనవ నేధీరా రమతేబంధు నిస్పృహా'

అని సంభావించును. సీతకు పతియే దైవము. భర్తకొరకు బంధువర్గమును విడిచిన పతిదేవత సీత. భర్తతో అరణ్యమును పొందిన తృప్తిగా కాలము గడుపగల గంభీరచారిత్ర. సామాన్యుడగు సూతుడు సీతను గంభీరచారిత్రగా ప్రశంసింపకుండ నుండలేకపోయెను.

రావణుని మంత్రియైన హర్షవహుడు సీతను గూర్చి - 'చంపక సౌరభ్య మివ షట్పదమాలా పశ్యతి రావణ విభవం సీతా!' అని పలుకును. భ్రమరములు చంపకముల దరిచేరవు. సౌరభాధిక్యము కలిగియు చంపకము భ్రమరములనాకట్టుకొనలేకపోయినది. అట్లే సకల శ్రీ విరాజితుడయిన రావణుడు సీత నాకర్షింపలేకపోయెను. సీతాషట్పదికి రావణుని సంపదలను చంపకములు తిరస్కృతములు. స్త్రీకి భ్రమరసామ్యము చెప్పుట శక్తిభద్రుని నూత్నప్రయోగము.

రావణ వధానంతరము సీత తనను మాయాసీతగా శంకించు రామునకు సత్య నిరూపణార్థమై స్వయముగా అగ్ని పరీక్షను విధించుకొనిన పతివ్రతామతల్లి.

( తరువాయి 17 వ పేజీలో )

# తెలుగువారు — ఒరియా భాషాసేవ

- శ్రీ వెలుదండ నిత్యానందరావు. ఎం.ఏ

శ్రీరాముని పుణ్యగాథను 'విచిత్ర రామాయణము' గా సంతరించిన ఒరియా కవి సారళా దాసనబడు సిద్ధేశ్వరదాసు. ఇతడు ఒరియా భాషలోని ఆదికవి. ఈ కావ్యమును గూర్చి ఒరియా వారికి మొదటగా తెలిపిన ఖ్యాతి, ఘనత శ్రీ పురిపండా అప్పలస్వామి గారిది. సార్థక నామధేయ యుతమైన ఈ రామాయణము వెలుగు చూచిన కథ కూడ విచిత్రము గానే యున్నది.

శ్రీ డొంకాడ గోపీనాథకవి విచిత్ర రామాయణమును వచన గ్రంథంగా తెనిగించినాడు. ఏతద్గ్రంథము 1892 లో ప్రచురింపబడినది. దాని (ఒరియా విచిత్ర రామాయణము) నాధారముగా చేకొని కొందరు చంపూ పద్ధతిని, నిర్వచనముగాను రచించారు. వేల్పూరి వేంకటకవి (1780-1853); నరసింహ దేవర వేంకట శాస్త్రి, కల్లేపల్లి వేంకటనరసింహమూర్తి (1874-1911) అట్టి వారిలో ముఖ్యులు. కొమ్మూరు సోమనాథ శిల్పాచార్యుడు కూడ నాంధ్రీకరించాడు. మూలగ్రంథమైన సారళాదాసు ఓఢ్ర రామాయణములో పదివేల పాదాలున్నాయని పేర్కొనుటచే నితడు సరాసరి ఒరియా నుండియే అనువదించెనని చెప్పనొప్పును. ఒరియా రామాయణంలో 11 వేల పాదాలు కలవు.

తెలుగు కర్తలు ఒరియా మూలగ్రంథమని తెలుపుటచే శ్రీ పురిపండా అప్పలస్వామి గారు మరింత శోధించి ఒరియా ఆది కావ్యము విచిత్రరామాయణ మని ప్రకటించారు. పురిపండా వ్యాసాలాధారముగా శ్రీ పోతాప్రగడ వేంకటరత్నం గారు 'కోణార్క' పత్రికలో నొక వ్యాసము వ్రాయుటతో సాహిత్య పరిశోధకులు దానికై అన్వేషణ జరిపారు. శ్రీ సచ్చిదానంద మిశ్రాగారు దానిని చీకటి కోట జమీందారు గృహంలో సంపాదించగల్గారు. దానిని పురిపండా సాయంతో తెలుగు అనువాదాలతో సరిపోల్చారు. 1967 డిసెంబర్ లో 'డగర' అను ఒరియా పత్రికలో శ్రీ సచ్చిదానంద మిశ్రాగారు ఒరియా ఆది కావ్యం సారళాదాసు విరచిత 'విచిత్ర రామాయణ' మని నిర్ణయించారు.

ఈ విధంగా ఆంధ్రుల అజమాయిషీలో నొక అన్యభాషలో నాది కావ్యము నిర్ణయింప బడుట ఆంధ్రుల కెంతయో గర్వకారణము.

శ్రీ పురిపండా అప్పల స్వామిగారు ఒరియా సాహిత్యమును గురించి లెస్సగా పరిశోధించి తత్ఫల మాధుర్యము నాంధ్రుల కందించిన వారిలో ప్రథములు. ఒరియా భాషలో వారికి గల ప్రజ్ఞ అపారము. ఒరియా వారి జీవన పద్ధతులు, సంస్కృతి, చరిత్ర ఇత్యాద్యనేక విషయముల పైని వ్యాసములు, ఉపన్యాసములు చేశారు. ఎన్నో ఒరియా నవలల నాంధ్రీకరించారు.

గోపీనాథ్ మహంతీ రచించిన 'అమృతసంతాన' (అమృత సంతానం) ను 1963 లో పురిపండా అనువదించారు. ఒరిస్సా దక్షిణప్రాంతంలోని 'కోద్' జాతి

ప్రజాజీవిత చిత్రణ మందలి విషయము. ఒరియా గ్రామీణ జీవితమును ఈ నవల పరిచయం చేయును. ప్రతి గ్రామంలోను కులపెద్ద ఆధిపత్య మప్రతిహతముగా కొనసాగును. మర్యాద, మాటనిలకడ వారి సొమ్ము. ధర్తినీ (ధరిత్రి) ధర్మ (సూర్యుడు) భీమదేవుడు (వరుణుడు) వారు కొలిచే దేవతలు.

మధుర వ్యావహారికంలో వ్రాయబడిన ఈ నవల చదవ దగినది.

కాళిందీ చరణ్ పాణిగ్రాహి రచిత 'మాటిర్ మనిష (మట్టిమనుషులు) 1956 లో పురిపండా తెలుగు వారి కందించారు. గాంధీ సిద్ధాంత ప్రాతిపదికగా వ్రాయబడిన ఈ నవల ఒరియా పల్లె పదాలలోని ప్రజా జీవితమును, ఆ నాటి నైతిక విలువల్ని, 'ఉమ్మడి కుటుంబ జీవికను టెలివిజన్ లా దర్శింప జేస్తుంది.

ఫకీర్ మోహనసేనాపతి గారి 'ఛమాణ ఆరగుంఠ'(ఆరెకరాల ఎనిమిది కుంటలు); గోవిందదాసు గారి 'అమావాస్యార చంద్ర' (అమావాస్య చంద్రుడు) 'నవలలను, అశ్వినీ కుమార్ ఘోషు గారి 'కలాపహాడ్' (కలాపహార్.) నాటకమును, సురేంద్ర నాథ శత్పథి, కాళిందీ చరణ్ పాణిగ్రాహి మున్నగు రచయితల కథలను పురిపండా తెనిగించారు. వీరు కేవలం నవలలేకాక కవితలను కూడ అనువదించారు. మచ్చునకు వీ రనువదించిన ప్రజానాథ్ రథో గారి కవితను చూడండి. నిలువుగా ఉన్న ఈ కవితను అడ్డంగా వ్రాస్తున్నాను.

'ఒక పక్షి సుదూర దిగంతం నుంచి ఎగిరివచ్చి నా నలువేపుల తిరగడం మొదలెట్టింది. దాని ఒక రెక్క మీద తరంగిత సముద్రం మరో రెక్క మీద కదలని ఆకాశం, దాని చుంచువున ఓ ఎర్రని ఆపిలులా వేలాడుతో, ది పృథివి. ఈ మట్టి పృథివి.

అది దాని అలసిన రెక్కలు రెండూ ఆడించి ఆడించి ఆహత కంఠంతో నాతో అంది. కొంచెం స్థల మియ్యగలవా? అవును. రవ్వంత స్థలం. రెండడుగులు మాత్రం. నిబ్బర పోయిన నేత్రాలతోనే నేను కొంచేపు దాన్ని చూశాను. అనంతరం భయంతో సంకోచంతో వొణుకుతున్న నా అరచేయి దాని వేపు చాచాను. పక్షి ఇప్పుడు నా అరచేతి చరియ మీద విశ్రాంతి తీసుకొంటున్నది.'[1]

'తెలుగు సాహిత్య ఇతిహాస' (తెలుగు సాహిత్యేతిహాసము) ను పురిపండా ఒరియా వారి కందించారు.

1932 లో వీరు ఒరియా స్వతంత్ర రాజ్యం'నయాగఢ'లో సదానందపరిషత్ స్థాపించి దాని కధ్యక్షులై ఒరియా సాహిత్య వికాసమున కెంతగానో కృషి సల్పారు. హైదరాబాదులోజరిగిన అఖిల భారత రచయితల మహాసభ కధ్యక్షుడుగా నుండి వీరు చదివిన 'ఓఢ్రహాళియా గేయాలు' (ఒరియాలు' ఒరియా పాలికాపుపాటలు) సింధీ భాషలోని కనువదింపబడి 1964 లో సింధీమాసపత్రిక 'కూంజ' లో ప్రచురింపబడినవి.

'ఈనాడు' దిన పత్రిక వారు 'విపుల' అను మాసప్రతిక ప్రారంభించారు. వీరి కృషి మిక్కిలి కొనియాడ దగినది. ఇట్టి కృషి రాష్ట్రాలమధ్య సయోధ్యకల్పించి, సుహృద్భావ సేతువు నిర్మించి, జాతీయ సమైక్యానికి పునాదులు వేస్తుంది. విపుల పత్రికలలో డి. కామేశ్వరిగారుఎన్నియో ఒరియాకథల ననువదించారు. వివిధ రచయితల ఓ రెండు మూడు కథలను ముచ్చటిస్తాను. కృష్ణ ప్రసాద్ మిశ్రా గారి కథ 'బంధితులు' విపుల జనవరి 1980 లో ప్రకటింపబడినది. 'ఇల్లాలే ఇంటికి దేవత' అని తెలియలేక ఎక్కడో ఆనందం దొరుకుతుందని ఆనందగవేషణులై ఇంటి నుండి వెళ్ళిపోతారు ఇద్దరు మధ్యతరగతి కుటుంబీకులు. ఎక్కడా ఆనందం పొందలేక పోవడంతో వారికి మానసిక పరివర్తనం కల్గుతుంది.

ఉన్న పరిస్థితులకు రాజీపడి తమ కనువుగా సృష్టించుకొని ఆనందం పొందలేని వారిపైని ఈ కథ సానుభూతి చూయిస్తుంది.

బసంత్ కుమార్ శతపథి 'క్లాసికల్ కామెడీ' ని కామేశ్వరిగారు విపుల 1980 మార్చి సంచికలో ప్రకటించారు.

డా॥ పాల్ గారు ఇంగ్లీషులో అమితంగా ప్రజ్ఞ సార్జించిన ప్రొఫెసర్. వీరిని భార్య విడచి పెడ్తుంది. ఒకరోజు పేపర్లో మ్యాట్రిమోనియల్ కాలమా కర్షిస్తుంది. అందులో ఇలా ఉంటుంది. 'Wanted a retired gentle man for a rich and highly educated widow' డా॥ పాల్ దాన్ని చూచి ఆనందంతో వచ్చే సం॥ము రిటైర్ కాబోతున్నట్లు, ఆమెను పెళ్ళాడ దలచినట్లు వ్రాస్తాడు. రెండు మూడు రోజుల పిదప పేపర్లో ఇలా సవరణ వస్తుంది. 'Wanted a refined gentle man not a retired gentle man.'

అచ్చు తప్పుల వలన ఒక్కొక్కసారి ఎంతరాద్ధాంతం, అపహాస్యం కల్గుతుందో వర్ణించింది ఈ కథ.

(సశేషం)

( 15 వ పేజీ తరువాయి )

అగ్నిపరీక్షానంతరము సీత తనపాదములపై వ్రాలిన లక్ష్మణునితో 'కుమార! ఉత్తిష్ఠ! ఉత్తిష్ఠ! కోత్ర దోషః! రాక్షస శీర్షస్పర్శపాంసులౌ పాదౌ కుమారేణ ఇదానీం ప్రక్షాలితౌ ఇవ పరిశుద్ధౌ భవతః' అనిపలుకును. రాక్షసుని స్పర్శచే అపవిత్రములయిన తన పాదములు లక్ష్మణునిచే కడుగబడినట్లు పరిశుద్ధము అయినవని సీత పలుకుట ఆమె కాతని యందుగల వాత్సల్యమును ప్రకటించును. సీతాపహరణ సమయమున రామరక్షణార్థము వెడలుట కంగీకరింపని లక్ష్మణుని శంకించిన సీత నోట ఈమాట వినిపించి శక్తిభద్రుడు సీతాలక్ష్మణులశీలములకు వన్నె తెచ్చినాడు. రామాయణము నందలి 'నూపురే త్వభిజానామి నిత్యం పాదాభివందనాత్' అను లక్ష్మణుని పలుకులకు సరితూగునట్లు శక్తిభద్రుని సీత పలికినది.

శక్తిభద్రుని సీత పాత్రచిత్రణము అపూర్వము కొన్ని తావులందు వాల్మీకమున సశోకయై అశోకవనమున కాన్పించిన సీత శక్తిభద్రుని నాటకమున సబలగా సాక్షాత్కరించును. ఎంతటి ముగ్ధయో అంతటి ప్రౌఢ శక్తిభద్రుని సీత.

[శ్రీమతి డా॥ కోలవెన్ను మలయవాసిని గారి పర్యవేక్షణలో పరిశోధన చేయుచున్నాను. నా పరిశోధనా విషయము - రామనాటకానుశీలనము. వారికి నమస్సుమాంజలులు]

1. ఆర్యపుత్రా! మీరా దీనురాలిని దిగస్కరించుటచే నాకుఁ జాల బాధకలిగినది' - ఆశ్చర్య చూడామణి, అనువాదము - విష్ణుభట్ల కృష్ణమూర్తి శాస్త్రి.
2. 'ప్రియవచనము వినుచున్నను హృదయము మాత్ర మెందులకో తపించుచున్నది' అనువాదము - విష్ణుభట్ల కృష్ణమూర్తిశాస్త్రి

—+—

భావ విప్లవసారధి దాశరథి

# తిమిరంతో సమరం

- శ్రీ డా. జి. బి. ఎన్. ఆచార్య, ఎం.ఏ., పిహెచ్.డి.

'నను గని పెంచి, నా రుధిర
    నాళములన్ కవితామరంద వా
హిని ప్రవహింపజేసి, రస
    హీన మనోమరుభూమి వందనం
దనములు నాటినట్టి కరు
    ణామయి యే గగనాల నున్నదో!
అనవరతానురాగమతి అమ్మకు
    ఈకృతి అంకితం బగున్.'

అని దాశరథి ఈ కావ్యాన్ని - తనను చీకటినుంచి వెలుతురుకు తీసుకువచ్చిన మాతృదేవతకు సమర్పించి ధన్యచరిత్రుడైనాడు.

దాశరథి తనచుట్టూనూ, దూరంగానూ జరిగిన అనేక సంఘటనల ప్రేరణతో కొన్ని కవితల్ని రచించాడు. ఆ కవితల సంపుట మే 'తిమిరంతోసమరం' కావ్యంగా మనకందించబడింది. ఈ కావ్యంలోని కవిత్వతత్త్వాన్ని విమర్శించేముందు, కావ్యనామౌచిత్యాన్ని పరామర్శించటం సమంజసం.

ఈ సమరం అనంతం. దురంతమైన తిమిరంతో అనంతమైన సమరం ఇది. మూఢత్వానికీ మూర్ఖత్వానికీ, తిరోగమనానికీ తిమిరం ప్రతీక. అంటే ఇది ఒక శత్రువు. ఈ శత్రువుతో యుద్ధంచేసే యోధుడే కవి. కవిత్వమే అతని ఆయుధం. ఒక్క కవే యేమిటి? విజ్ఞానానికీ, అజ్ఞానానికీ మధ్య జరిగే హోరాహోరీ పోరాటంలో మేధావివర్గానికి చెందిన ప్రతివ్యక్తి సైనికుడై పాల్గొనితీరాలి.

దాశరథి అభ్యుదయ కవిత్వం - విప్లవ కవిత్వంగా పరిణతి చెందటం మనకు ఈ కావ్యంలో కనిపిస్తుంది. విప్లవ మంటే సాయుధవిప్లవం కాదు. భావవిప్లవ మన్న మాట. చీకటి దుష్టశక్తి. ఆదుష్టశక్తితో పోరాటం చేసేవాడు సూర్యభగవానుడు. ఇది నిత్యం మనం చూస్తున్న ప్రకృతి సత్యం. కవులుకూడా ప్రకృతిసత్యాలనే ప్రతిపాదిస్తారుకదా! అందుచేత ఇక్కడ దాశరథి ఆదిత్యసన్నిభుడైనాడు. చీకటి రాక్షసిని రవి-కిరణాలఖడ్గాలతో చీలిస్తే, కవి - కవితల ఖడ్గాలతో చీలుస్తాడు. ఈ విషయంలో రవికీ, కవికీ ఎంతో పోలిక కనిపిస్తుంది. 'తిమిరంతో సమరం' అనే శీర్షిక కవిలోని విజ్ఞానాన్ని, వివేకాన్ని, క్రోధాన్ని, సాహసాన్ని వ్యక్తం చేస్తుంది. తిమిరం లోకంనిండా నానా రూపాలతో విజృంభిస్తుంది. అందుకే కవి కూడా బహుముఖప్రతిభతో దాన్ని ఎదుర్కొని విజయం సాధిస్తాడు. దాశరథి విషయంలోకూడా అదే జరిగింది.

కవికి కాంతి ఎంత ప్రధానమో శాంతి కూడా అంత ప్రధానం. అందుకే దాశరథి తన కావ్యాన్ని 'రావమ్మా! శాంతమ్మా!' అంటూ శాంతికి స్వాగతం చెప్పటంతో ప్రారంభించాడు. ఈశీర్షికలో - 20 వ శతాబ్దం చివరకూడా కులమత తత్త్వాలు మాయలే దని, భూమికోసం, ఇళ్ళస్థలాలకోసం యుద్ధాలుఆగలే దని, శాంతి కోపగించి 'రానంటే ఊరుకోను నిన్ను అణువణువునా చూస్తాను. నిన్ను మాయింటికి తీసుకువస్తాను.' అని నిశ్చయంగా చెపుతాడు కవి.

'నీవు రా వన్నాయి మోళ్ళు
నీవు లే వన్నాయి ముళ్ళు
నిజం నిజ మన్నాయి రాళ్ళు
నమ్మలేకున్నాయి నా కళ్ళు'

అని దాశరథి తనలోని 'తహతహ'ను వెలిబుచ్చాడు. మోళ్ళు ముళ్ళు' రాళ్ళు -

ఇవి అశాంతికి చిహ్నాలు. ఈ చిహ్నాలు శాంతి లేదన్నా, శాంతి రాదన్నా నమ్మలేకుండా వున్న కవి – తన అంతరాత్మ ప్రబోధంతో, కవితా నేత్రాలతో శాంతిని దర్శించి, స్వాగతం పలుకుతున్నాడు. ఇది కవుల ఆత్మవిశ్వాసాన్ని వెల్లడిస్తున్నది. కవికి ఆత్మవిశ్వాసమే కాక, ఆత్మాభిమానం, అధికారం చెలాయించే దర్పం కూడా వుండాలి. అందుకే–

'పూలు పూయాలి, పూచి తీరాలి,
వెలుగు రావాలి, వచ్చి తీరాలి,
జయం కలగాలి, కలిగి తీరాలి,
జనం బ్రతకాలి, బ్రతికి తీరాలి.'

అని తన వాక్కులనే నవజాతికి వేద ఋక్కులుగా వినిపించాడు. ఈ వాక్కుల ఋక్కుల్లో కవి 'సంకల్ప శుద్ధి' దిక్కుల్లో మార్మోగింది. తనకాంక్ష తప్పక ఫలించి తీరా లన్న ధ్యేయాన్ని ధ్వనింపచేసాడు. తాను శాసించటం, జరగక పోవటమూ నా? అనే 'ధీమా'ను కూడా ప్రకటించాడు. 'Poets are unacknowledged legislaturs of the world' అన్న సూక్తికి బాసటగా నిలిచిన దాశరథి ప్రపంచాన్ని శాసించటమే కాకుండా, ప్రపంచంకోసం తన సర్వస్వాన్ని ధారపోయటానికి సిద్ధపడిన త్యాగధనుడు. ఎవరికీ కనపడని 'శాంతి'ని వెదకటం ప్రారంభించాడు. రవి గాంచనిచో కవి గాంచు ననే అభిజ్ఞుల అభిభాషణం వృథాపోలేదు. అందుకే దాశరథి–

కల్లాకపటం ఎరుగని
పిల్లవాళ్ళ ఉల్లంలో,
సింధువులను ఇముడ్చుకునే
'గాంధీజీ' అడుగులలో
కత్తులను తుత్తునియలు చేసిన
కవీశ్వరుల కలం ముక్కులో
నీ వుంటా వని తెలుసు నాకు.'

అనే సంతోషాన్ని ప్రకటించాడు. తాను పసిగట్టిన శాంతిని నలుగురికీ పరిచయం చేసి, తన కర్తవ్యాన్ని నెరవేర్చాడు. ఆశే తన వూపిరిగా బతుకుతున్న దాశరథి–

'ఉగాదివై
నా ఆశల పునాదివై
సమరానికి సమాధివై
నరహంతల విరోధివై
జగాలలో అవతరించు!
రణాల తల లుత్తరించు
నామనవిని చిత్తగించు!
స్వాగతమో! శాంతమ్మా!
చైతన్య నిశాంతమ్మా!
దీప్యమాన దిశాంతమ్మా!
జగన్నాటక సుఖాంతమ్మా!
స్వాగతమో! శాంతమ్మా!'

అని అవ్యక్తానంద మధురంగా శాంతిదేవత స్వాగత గీతిని వినిపించాడు.

'క్షీరసాగరం' అనే ఖండిక– నయనానందకర మైన నాగార్జునసాగర ప్రశంసా గీతిక.

కృష్ణ నాపి నిరుపేదల
తృష్ణ బాపినట్టి వారు
విష్ణువుకంటె ఘను లని
వేనోళ్ళ చాటింతును!'

అని తన 'మానవతా' దృక్పథాన్ని చాటాడు. దైవత్వంకన్నా మానవత్వమే మిన్న అనే నిశ్చయాన్ని వెల్లడించాడు. ఆంధ్రాభిమానం పుష్కలంగా సంతరించుకున్న దాశరథికి నాగార్జున సాగరం నయనానందకరంగా కనిపించటంలో వింతలేదు ఆయన ఈ సాగర తీరంలో ఎంతో శాంతిని దర్శించాడు. నవచరితకు నాంది పలికిన నాగార్జున సాగరం–

'తెలుగింటను కలిమి నింప
గలుగు క్షీరసాగరము'

అని ఎంతో మనోహరంగాను, మధురంగాను వూహించాడు. ఈ వూహ సత్య సంపూర్ణమైనది కూడాను. కనుకనే నాగార్జునసాగర నిర్మాణంలో పాల్గొన్న వారిని విష్ణువుకంటె ఘను లని ప్రశంసించాడు.

అశేషమైన ఆంధ్రాభిమానం ఆయన రక్తంలో ప్రవహించటం వల్లనే తెలుగునాడు ముక్కలు కాకూడ దనీ, సమైక్యాంధ్రమే తెనుగు జాతికి శ్రేయోదాయక మనీ దాశరథి ఎలుగెత్తి చాటాడు.

'అక్షుగనక్షత్రమాల'

అనే ఖండికలో–

'గోదావరి నురుగులు
కృష్ణమ్మ పరుగులు
తుంగభద్ర తరగలు
మంజీర మెరుగులు
నీ కొంగున కలకాలం
నిలిచి ఉండవలెనమ్మా!'

అని ఎంతో అందంగా, రసనిష్యందంగా సంభావించాడు. ఇంకా 'సమైక్యాంధ్రము' అనే ఖండికలో–

'తెలుగంటే ఒక్కటనే
కల – చెడ దని తెలియగనే
వెలిగించితి దీపాలు
తొలగించితి కోపాలు'

అని తన సంతోషాన్ని తెలియజేసాడు. ఆయన దృష్టిలో తెలంగాణ వట్టితొమ్మిది జిల్లాల భూభాగంకాదు; తెలంగాణ బహుళాంధ్రకు పర్యాయపదం. దాశరథి కవితలు చదువుతున్నంతసేపు 'కలిసి వుంటే కలదు సుఖం' అనే భావం స్ఫురిస్తుంది. విడిపోవడ మంటే పడిపోవడం. వివాదాలు అంతరించాలి. విభేదాలు మాసిపోవాలి. పరస్పరావగాహనం పెంపొందాలి. దాశరథి ఆకాంక్షించినట్లు గా మనం–

'తెనుగు దివ్వె వెలిగించి
పెను చీకటి తొలగించి
ఆసేతు హిమాచలం
ఆంధ్ర మొక్కటనిపింతాం.'

అంతేకాదు - లక్షల సమగ్రాంధ్ర దీపావళులను, కోట్ల సమైక్యాంధ్ర దీపావళులను నిత్యం - ఆజన్మాంతం జరుపుకుందాం, అప్పుడే దాశరథికి సంతృప్తి.

దాశరథి ఆంధ్రాభిమానం సంకుచితమైనదీ కాదు - ఇరుకు గోడల మధ్య ఇమిడి పోయేదీ కాదు. అది అఖండ భారతాభ్యున్నతికి దోహదం చేసేదీ - విశాల విశ్వమానవతా వాదానికి వన్నె పెట్టేదీ; ఒకదానితో మరొకటి పెనవేసుకు పోయేదీ - పోను పోను ఉన్నత శిఖరాలను కొనిపోయేది. అందుకే దాశరథి పొంగులు వారే హృదయంతో -

‘తెలుగు జాతి ఒక్కటి
భరత జాతి ఒక్కటి
ప్రపంచమే ఒక్కటి’

అనిగొంతెత్తి పాడాడు. ఇదీ ఆయన విశాలవిశ్వ మానవతా వాదానికి నిదర్శనం. ‘వసుధైక కుటుంబమే ఆయనలక్ష్యం. ఒక జాతి తన మనుగడ కోసం, మరొక జాతిని పీడించాల్సిన పని లేదు. సర్వమానవశ్రేయస్సు కాపాడుతూనే తన బతుకును తాను ఉజ్జ్వలం చేసుకోవచ్చునన్నదే ఆయన ప్రగాఢ విశ్వాసం, ఈ సందేశాన్నే ‘తిమిరంతో సమరం’ ద్వారా మనకు దాశరథి వినిపిస్తున్నాడు. అందుకే ఆయన —

‘మనిషి మనిషి ద్వేషించని
మార్గం వెతకాలి.
జగతిని, సుఖశాంతులు గల
స్వర్గం చేయాలి.’

అని ప్రబోధిస్తూ —

‘హింసనుండి నవసమాజ
హంస ఉద్భవించు ననే
అసత్యాన్ని నమ్మకు
హంతకుడవు కాబోకు.’

అని హితవు నుపదేశించాడు.

(సశేషం)

# మందార మకరంద మాధుర్యము

- శ్రీ కే. కిశోరబాబు, ఎం. ఏ.
- శ్రీ కే. అశోకబాబు, బి. ఎస్‌సి. (అగ్రి)

(గత సంచిక తరువాయి)

పోతన రచించిన మందారమకరంద, నీరదాగమమేఘ - ఈ రెండు పద్యముల ననుకరించుచు చాలామంది కవులు పద్యములను రచించినారు. యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః, సయత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే అని కదా భగవద్గీతా వచనము!

వారధర్మమును బోధించిన తల్లితో కూతురిరువురు శ్రీ కాళహస్తి పతి పదకోకనదారాధనంబె ఫలధర్మ మని

శివు నపేక్షించిన చిత్తంబు చిత్తజా
యత్తమై విటులపై నాసపడునె?
పరశివస్తుతి కథాభావంబు విను వీను
లానునే కుంటెనలాకు పలుకు
లీశ్వరేశ్వర మూర్తి నీక్షింపగోరెడు
చూపన్య రూపంబు చూడ జనునె?
ముక్తివల్లభు ననురక్తి గూడ దలంచు
కాయంబు కూడునె కాముకులను
హరునిభవహరు శ్రీకాళహస్తి నిలయు
వినుతి యొనరించు జిహ్వ కమనుజపతికి
బ్రియము జెప్పంగబోవునె నయము మీఱ
వారధర్మోపదేశంబు వలదు తల్లి.
(శ్రీ కాళహస్తిమాహాత్మ్యము 4-39)

‘అమృతము గ్రోలుజిహ్వా చవి
యంచు దలంచునె తేనె? నింటిలో
నమరమహీరుహం బుదయ
మైన, నరుం డవనీశు వేడునే?
యమిజన భాగ్యరూప మగు
నాదిమతత్త్వము గాళహస్తి దై
వము భజియించు మానసము వార
వధూ మద సౌఖ్య మెంచునే?
(శ్రీ కాహస్తి 4-43)

అని హితబోధగావించినారు. ఈ ఘట్టమున మందార మకరంద పద్యము ననుకరించుచు ధూర్జటిపై రెండు పద్యములను రచించినాడు. గాని పోతన పద్యములలోని ఉపమానసంపద వీటియందు కొరవడినది. ధూర్జటి పద్యములు సరళముగానే యున్నవిగాని పోతన పద్యముముందవి ‘రాజును చూసిన కళ్ళతో మొగుణ్ణి చూసినట్లుగా’ అనిపించుచుండును.

ప్రత్యక్షమైన పరమశివుని గని పర్వతుడు ‘భక్తికంటెను ముక్తి సాధకంబును, నీకంటె నధికంబులేదు గావున నీ పాదపద్మంబులమీది భక్తి యందక్క నామనంబన్యవరంబు గోరదు అని యివ్విధమున స్తుతించినాడు.

క్షీరాంభోధి తరంగ రింగిత
పరిక్రీడా కళాగర్భవి
స్తారోల్లాస మరాళ మా చవిటిగుం
టన్ జేరగా గోరునే?
ధీరుండైన భవత్పదాబ్జ యుగళీ
దివ్యామృతస్వాది ని
స్సారంబంచు దృణీకరించును మరు
త్సౌఖ్యంబు లాసించునే - 1

‘నీ తత్త్వామృత సౌఖ్యము న్మరగియు
న్నీ దివ్యవిజ్ఞాన ని
ష్ణాతుండైన భవత్పదార్చకుడు సం
సారంబు కాంక్షించునే?
చూతస్వాదు ఫలోపభోగముల చే
శోభిల్లు కీరంబుదా
జేతఃప్రీతిని రేగుబంటి రసమున్
సేవింపగా నేర్చునే?’ - 2

‘రాకానిర్మల చంద్ర చంద్రిక జకో
రం బాత్మ సంతుష్టిగా
నాకాంక్షన్ భుజియించుగాక తిమిరం
బాసింపగా గోరునే?

నీకుం దక్కిన భక్తియుక్తుఁ డెపుడున్
నీపాద సౌఖ్యార్థియై
యాకంజాత భవాది భోగముల న
త్యల్పంబులన్ గోరునే?' - 3

కరిపోతంబు తదీయ మాతృకుచ మా
కాంక్షించుచుగా కెట్లు సూ
కర వక్షోరుహదుగ్ధధారల మదిన్
గామించునే దేవ నీ,
చరణ ద్వంద్వ పయోజభక్తి కల నా
సౌఖ్యామృతాస్వాది ని
ర్జర రాజ్యాధిక దివ్యభోగముల ని
స్సారంబులన్ గోరునే?' - 4
(పర్వత పురాణము ద్వితీయాశ్వాసము
పుటలు 40-41)

మందార మకరంద పద్యము ననుకరించుచు దాని భావమును నాలుగు వృత్తములుగ మలచి నాగలూటి శేషనారాధ్య కవి రచించిన పైపద్యములు ప్రౌఢములుగా నున్నవి (కవికాలము క్రీ.శ.1569) కరిపోతంబు తదీయ మాతృకుచ మాకాంక్షించుఁ గాకెట్లు సూకర వక్షోరుహ దుగ్ధధారల మదిన్ గామించునే అను పోలిక వినూత్నముగా నున్నది. మందార మకరంద ఛాయలలో నడచిన పద్యములలో మును పెన్వరూ ఈపోలికను పేర్కొనలేదు. మందార మకరందము ననుకరించి నాగలూటి శేషనారాధ్యకవి నాలుగు వృత్తములు తయారు చేయగా బొరిగొండుపుల ధర్మయ్య అను మరొక కవి దాని ననుకరించి నాలుగు కందములను తయారు చేసినాడు.

'మందార కుసుమముల మక
రందము సుఖవృత్తి గ్రోలు
భ్రమరంబులు యిం
పొందని మదనము చేరునె
మందరధరు దాసు డొండు మతముల
జనునే?'

'అమరతటీ తరగంబుల
నమరఁగ నోలాడు రాజహంసము చనునే
ప్రమదముతో శైవలినీ
సముదయముల కట్టి దుర్విచారములేలా?'
దీకొని వేఁడుకరాక సు
ధాకర కిరణములు గ్రోలునట్టి చకోరం
బేకరణి జను హిమానీ
శీకరములకట్టి తగని శిక్షలవేలా?
అలవి సహకార పల్లవ
ములఖాదినియగుచు నిష్టములనుండెడుకో
కిల కుటజములకుఁ బోవునె
జలజాక్షునిభక్తుఁడన్య భజనకాఁ బుదలచునే
(నృసింహపురాణము 83 వ కమ్మ)

పోతనగారి పద్యమునకు యథాతథ అనుకరణముగా నున్నవి ధర్మయ్యగారి కందములు.

కూచిమంచి తిమ్మకవి మందార మకరందము ననుకరించి అచ్చతెనుగులో పద్యమును రూపొందించినాడు.

దిట్టంపు మిన్యాక తరగ చాలున దేలు
తెలిపుల్గు బురద గోతులకుజనునె
పుడుకప్రమాన్విరితావి పువ్వుదేనియలాను
మగదేటి తుమ్మి కొమ్మలకు చనునె.
(నీలాసుందరి పరిణయము 2-76)

నీలాసుందరి పరిణయమునందే గాక కుక్కుటేశ్వర శతకమునందు గూడ మందార మకరంద పద్యము ననుకరించుచు పద్యమురచించివాఁడు కూచిమంచితిమ్మన.

కుంభి కుంభస్థ లాత్త్యుద్రామిషము మెక్కు
సింగంబు కప్పల మ్రింగ జనునె
సారభూరుహఫలాహార లీల జెలంగు
కీర ముమ్మిత్తల జేరుకొనునె
యభ్రాపగా హాట కాబ్జమృణాళముల్
కొనునంచ బురద వాగులకు జనునె
ప్రబల వర్షాంబుధారలు గ్రోలువాన కో
యిల కోరి మంచుసోనలకు జనునె
ప్రభు భుజానీత భూరివైభవ నిమగ్న
విద్వదవతంస మల్పుల వేడ జనునె?
(కుక్కుటేశ్వర శతకము 75)

కుంభి కుంభస్థలాత్త్యుద్రామిషము మెక్కు సింగంబు కప్పల మ్రింగ జనునె అనునది కరికుంభ పిశితసద్గ్రాస సమోదిత సింహము అరుగునే శునక మాంసాభిలాష అను దానికి ప్రబల వర్షాంబు ధారలు గ్రోలు వానకోయిల కోరి మంచుసోనలకు జనునె అనునది నీరదాగమ మేఘ నిర్ముక్తపయః పాన చాతకం బేగునే చాటిపడెకు అను దానికి ప్రతిబింబములుగ నున్నవి.

కొండలవంటి కావ్యకవుల నేగాక ఉడుతవంటి శతకకవులను గూడా మందారమకరంద పద్య మాకర్షించినది. దాని ననుకరించుచు నరసింహ శతక కర్త శేషప్ప.

ఇభకుంభములమీది కెగిరెడి సింగంబు
మిట్టునే కురుచైన మూషికముకు?
నవ మాతపత్రముల్ నమలుచున్న పికంబు
గొలుకునే జిల్లేడు కొవలు నోట
నరవింద మకరంద మనుభవించెడి తేటి
పోవునే పల్లేరు పూలకడకు?
లలితమైన రసాలఫలము గోరెడి చిల్క
మెసవునే భ్రమను ముమ్మొత్తకాయ?
నిలను నీకీర్తనలు పాడ నేర్చినతడు
పరులకీర్తన బాడునే యరసిచూడ
(నరసింహ శతకము 76)

అను పద్యమును రచించినాడు. పద్యము మనోహరముగా నున్నది.

పోతన ఏసుముహూర్తమునందు మందార మకరంద పద్యమును రచించినాడో గాని తెనుగునాట అది నీటిమీద నూనె చుక్కవలె త్వరత్వరగా వ్యాపించి బహుళ ప్రచారము నందుకొనినది. దాని ముందు దానికి మూలమైన మూలపద్యములు గూడా మూలకుబడినవి. ఎన్ని అనుకరణములు వచ్చినను అదిమాత్రము పాతబడలేదు. పుటము బెట్టిన బంగారము వలె మరింత మెరుగెక్కి శోభించినది. గోపాలునికి ఎంతమంది గోపికలున్నను గుండెలోన నెలకొనినది రాధ ఒక్కతే అయినట్లు ఎన్ని అనుకరణ పద్యములు వచ్చినను తెలుగువారి గుండెలోన గూడు కట్టుకొనినది మందార మకరంద పద్యమొకటే యని కచ్చితముగా చెప్పవచ్చును.

—+—

# గ్రంథ సమాలోచన

## 1. మినీకవితా విప్లవం

[కవితా సంకలనం : సంకలనకర్త, కొల్లూరి. ప్రతులకు; సంస్కృతీసమాఖ్య, తూ॥గో॥ జిల్లా, అమలాపురం, పుటలు 172. వెల : రూ 10]

విప్లవం ప్రక్రియకు సంబంధించింది కాదు. కంటెంట్‌కు సంబంధించింది. పుస్తకానికి ఈ పేరు పెట్టడంవల్ల విస్తృతమైన భావం ఉన్న విప్లవానికి పరిధు లేర్పడ్డాయి. 'ఒక సంప్రదాయం మీద తిరుగు బాటుకు విప్లవం అని పేరు ... భావవిప్లవం మొదలైన పదాల్లోని అర్థమే ఇక్కడ తీసుకోవాలి' అంటున్నారు శ్రీ అద్దేపల్లి 'మినీ విప్లవానికి ఆహ్వానం' రాస్తూ. మరలా అయితే తెలుగు సాహితీ రంగంలో ఇప్పటికి అలాటి మార్పులు చాలా ఏర్పడ్డాయ్ భవిష్యత్తులో ఏప్రక్రియ ఎన్నాళ్ళుంటుందో చెప్పలేం. ఎన్నెన్ని మార్పులు, రానున్నాయో! అలాంటప్పుడు ప్రతిమార్పునూ 'విప్లవం' అంటూపోతే అసలు విప్లవానికి ఉన్న భావం పోయి నిజమైన విప్లవం వచ్చినపుడు దాన్ని మనం 'విప్లవం' అంటే ఆ విప్లవం ఇలాటి అన్ని విప్లవాలతో పాటు కలిసిపోయి తన విశిష్టతను కోల్పోతుంది. విప్లవం అపురూపమైన పదం. దాన్ని అపురూపంగా వాడుకుంటేనే మంచిది.

ఇందులో 189 కవుల మినీకవితలు325 దాకా ఉన్నాయ్. శ్రీ పురాణం సుబ్రహ్మణ్య శర్మ 'బహురూపి' రాస్తూ లబ్ధప్రతిష్ఠులైనవారు, యువకులు, ప్రారంభకులు, అందరినీ యిందులో ఇరికించడం వలన ఈ సంకలనం 'చెంబులో చందమామ' లా ఉంది' దన్నారు. అవును అది నిజం !

ఇందులో నిజంగా మినీకవితాలక్షణాలు ఆవిష్కరించుకున్న కవితల్ని వేళ్ల మీద లెక్కించవచ్చు. అసలు మినీకవితకు ఎన్ని లైన్లు ఉండొచ్చో ఎవరైనా చర్చించి ఉంటే బావుండేది. మూడు నుంచి ఇరవై రెండు లైన్లున్న కవితలవరకూ ఇందులో ఉన్నాయ్. మినీకవితలకు ఆలంబనమైన Economy of words, spark మొదలైన లక్షణాలు ఈ కవితల్లో మృగ్యాలు. కవితలో ఆలక్షణాలు లేనప్పుడు ఆ కవితను మినీ కవితగా ముగించ వలసిన అవసరమేం వుంది – పొడిగించ వచ్చుగా? అన్న ప్రశ్నలొస్తయ్! 'వర్షం' 'గోరింటాకు, 'కవి' 'ఆశ' లాంటి నిర్వచనం ప్రధానంగా గల కవితలో Spark లేకపోవడం వల్ల అవి మినీ కవితలుగాకాక కేవలం నిర్వచనాలుగా మిగిలి పోతున్నయ్!

మెచ్చుకో తగ్గ విషయం ఏమిటంటే ఇందులో అభ్యుదయం ప్రధానవస్తువుగా గల కవితలే ఎక్కువగా ఉన్నాయ్ – ఇదమిత్థమైన అభిప్రాయం, నిర్దుష్టమైన ఆలోచన, లేని రచనలు కాలగర్భంలో కలసి పోతాయని ఇందులో కొన్ని కవితలు భవిష్యత్తులో నిరూపిస్తాయ్!

'నాకు పుట్టినప్పుడే తెలుసు – నే నేడిస్తే మీరునవ్వుతారు'–వసీరా. 'తనని బాధిస్తున్న ప్రపంచపు ముల్లును పీకి పారేసి ఈ పిల్ల చకచకా ఎటో నడిచి పోయింది'– ఇస్మాయిల్. 'అస్తమించిన సూర్యుని వంటిది కోరిక – మళ్ళా మర్నాడు ఉదయిస్తుంది' – ఉపద్రష్ట సాయి. 'ఆకలి – ఆటంబాంబులా పేలుతుంది – పేలిన ప్రతిచోట వ్యవస్థ మారి తీరుతుంది'– కొయిలాడ. ... ఈ వ్యవస్థలో మనంబతికింది తొమ్మిది మాసాలే' – జింబో. లాంటిమాటలు పుస్తకమూసినా Haunt చేస్తూనే ఉంటాయి.

ఇవి కాక మినీకవిత – పరబ్రహ్మ – మనిషి సామాగ్రి – వీళ్ళు – లోకం – బ్లడీ బేంకింగ్ – బీరువా – ఇంటర్వ్యూ- కవితలు పుస్తకం నిలబడ్డానికి ఆధారాలుగా ఉంటయ్!

వేగంగా చదివించడం మినీకవితగుణం. ఈ పుస్తకంలో వేగంగా పరుగెత్తే మనకు అప్పుడప్పుడూ అచ్చుతప్పులు ముళ్ళలా గుచ్చుకుంటయ్.

200 పేజీల మామూలు తెలుగునవల పదిరూపాయ లుండగా, ఈ పుస్తకం ఖరీదుకూడ పదిరూపాయలే అంటే పెద్ద ఎక్కువ అనిపించదు.

సంకలనకర్త కొల్లూరి కృషి అభినందనీయం.

శ్రీ. కొ. వేం. రమణమూర్తి.

## 2. కళాతపస్వి

[కరపత్రము : రచన శ్రీ గుడిపాటి శ్రీహరికృష్ణ. వెల 1-00. త్యాగరాజ నగర్, రాజమండ్రి. 533101]

ఇది $\frac{1}{8}$ డెమ్మీ సైజులో 6 పేజీల కరపత్రం. ముప్పది సంవత్సరములనుండి త్యాగరాజ నారాయణదాస సేవాసమితి పక్షమున ప్రధాన కార్యకర్తయై అవిచ్ఛిన్నముగా ప్రతిసంవత్సరము జగజ్జేనీయ మానముగా గానసభలను నిర్వహించుచు షష్టిపూర్తి గావించుకొన్న కళాతపస్వి శ్రీ బుగ్గాపాపయ్యశాస్త్రిగారి జీవిత విశేషములు, త్యాగరాజ నారాయణదాస సేవాసమితి స్థాపనము, కార్యక్రమ నిర్వహణము, శాశ్వతనిధి స్థాపనము, త్యాగరాజమందిర నిర్మాణావశ్యకత, కృషి; సంగ్రహముగా స్పష్టముగా ఇందు వివరింపబడినవి. శ్రీ పాపయ్యశాస్త్రిగారి ఫొటో కూడ ఇందు గలదు. – గౌతమ.

# ఈ పక్షంలో

## కృతిప్రదాన కల్యాణమహోత్సవ మహాసభ.

స్వస్తిశ్రీ చాంద్రమాన రౌద్రి నామ సంవత్సర మాఘ శుద్ధ చతుర్థి ఆదివారము సాయంకాలము 6 గంటలకు కాకినాడ శ్రీసూర్య కళామందిరములో - శ్రీ దేవీ భాగవతము పద్య పురాణము శ్రీ వాల్మీకి రామాయణ పద్య కావ్యము అను కృతి రత్న ద్వయమును కన్యాదాత శ్రీ బులుసు వేంకటేశ్వరులు శ్రీవేంకటేశ్వరస్వామికి అంకిత మిచ్చి మహా వైభవోపేతముగా వేదోక్త శాస్త్రాచారానుసారముగా కల్యాణమహోత్సవము జరిపించిరి. శ్రీతిరుమల తిరుపతి దేవస్థానము ఎగ్జిక్యూటివు ఆఫీసరు శ్రీ పి. వి. ఆర్. కే. ప్రసాదు ఐ. ఏ. యస్. ముఖ్యఅతిథిగా విచ్చేసిరి.

మహా పురాణములు, మహాకావ్యములు, పూర్వపద్ధతిని నిరుపమముగా వ్రాయుకవులు చాల తక్కువయుండి ఉన్న ఈ కాలములో శ్రీ అన్నవరం సత్యవతీదేవి స్త్రీల ప్రభుత్వ కళాశాలలో ఆంగ్ల భాషోపన్యాసకులై యుండి కూడ ఆంధ్రములో శతాధిక మహా గ్రంథములు, పురాణ కావ్యనాటక శతక వచన రచనలు, చేసి స్వయముగా ప్రకటించిన శ్రీ బులుసు వేంకటేశ్వరులు పై రెండుకావ్యలకు కృతికర్తలు. ఆయనను శ్రీ వేంకటేశ్వరస్వామిని కృతి కన్యకలను కొందఱు కన్యకలను వైభవోపేతముగ ఊరేగింపుతో, మేళతాళములతో, నాదస్వరయుగళముతో పురప్రముఖులు, విద్యావేత్తలు ఉపాధ్యాయులు, కళాశాలా విద్యార్థినులు సభాభవనమునకు తీసుకొనివచ్చిరి. ప్రత్యేకముగా ఆహూతులైన మహాపండితులు బ్రహ్మత్వము వహించి కల్యాణమహోత్సవము యథా శాస్త్రీయముగా, వేదోక్తముగా, సదాచారానుసారముగా జరపించిరి. ప్రేక్షక జనుల మహానందము గోత్ర ప్రవర ప్రవచన సమయమున మహాసంకల్ప సమయమున మిన్నుముట్టినది. అచింత్య, అవ్యక్త, శ్రీమన్నారాయణ త్రియార్షేయ శ్రీమన్నారాయణ గోత్రము శ్రీ వేంకటేశ్వరస్వామిది. ఆయన శ్రీనిర్గుణ పరబ్రహ్మ ప్రపౌత్రుడు, సగుణబ్రహ్మ పౌత్రుడు సచ్చిదానంద స్వరూపుని పుత్రుడు. శ్రీనివాస వేంకటరమణ శర్మ వరుని నామధేయము. మఱి కన్యకలో - ఆంగీరసాయాస్య గౌతమ త్రియార్షేయ ప్రవరాన్విత శ్రీగౌతమస గోత్రజలు, శ్రీ వేంకటేశ్వరప్రపౌత్రికలు శ్రీ వేంకటేశ్వరపుత్రికలు. ప్రథమ కన్య పేరు శ్రీ దేవీభాగవత మహాపురాణ లక్ష్మి, ద్వితీయ కన్య నామధేయము శ్రీ వాల్మీకి రామాయణ మహాకావ్యసరస్వతి. ఇది శ్రీ వేంకటేశ్వరుల ఉపజ్ఞ

వేదఘోషలు, నాదస్వరములు, మంగళ వాద్య ఘోషలు, సభ్యుల కరతాళధ్వనుల మధ్య, జనబాహుళ్య సంకులమైన సభాభవనములో పై ప్రవర చెప్పుచుండగా ముక్కోటి దేవతలతో శ్రీ వేంకటేశ్వరస్వామి దృశ్యాదృశ్య స్వరూపియై, అచట విచ్చేసి నిలచిరని సభ్యులెల్లరు భావించి ఆనంద కోలాహల నిమగ్నులైరి.

తరువాత అచ్చట నేజరిగినమహాసభకు శ్రీ పి. వి ఆర్. కే. ప్రసాద్, ఐ. ఏ. యస్. అధ్యక్షతవహించిరి. చిరంజీవిని, మండలీక సూర్యకుమారి బి కాం. ప్రార్థన గానం చేసి సభ్యులను ఆనంద తరంగములలో ఊగించినది. ఆహ్వానసంఘాధ్యక్షులైన శ్రీ రాయప్రోలు ఆంజనేయశర్మ ఇన్ కంటాక్సు ఆఫీసరు, సభ్యులకు అధ్యక్షులకు, వక్తలకు స్వాగతము చెప్పి వేదిక నలంకరించిన అధ్యక్షులను, శ్రీ వేంకటేశ్వరులను పుష్పమాలాలంకృతులను చేసిరి. శ్రీ నేత్రకంటి రమాదేవిని శ్రీ సూర్యకుమారి పుష్పమాలాలంకృతురాలిని చేసినది.

అధ్యక్షులు సభ్యుల కరతాళధ్వనుల మధ్య శ్రీదేవీ భాగవత మహాపురాణము (పద్య ప్రథమ సంపుటము) శ్రీ వాల్మీకి రామాయణ మహాకావ్యము (నిర్వచనము ద్వితీయసంఘటము) ఆవిష్కరించిరి. శ్రీ బులుసు వేంకటేశ్వరులు అంకిత పద్యములు చదివి వినిపించి అచింత్యావ్యక్త అనంత శ్రీ మన్నారాయణ లీలావైభవమును స్వీయానుభవ విశేషములతో జోడించి ప్రవచించి సభ్యప్రపంచమును అతీంద్రియ దివ్యస్థితిలోకి తీసికొనిపోయిరి.

అధ్యక్షులు తమ ఉపన్యాసములో శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము చేయుచున్న ఆధ్యాత్మిక ప్రచారసేవను విపులీకరించుచు ఆధ్యాత్మిక గ్రంథ ప్రచురణకు సాయము చేయుట ఆధ్యాత్మిక గ్రంథముల సర్వస్వామ్యములు తీసికొని ప్రకటించి ప్రచారము చేయుట, తలపెట్టిన దని కులమత వివక్ష లేక అర్హతగల గ్రంథములకే తాము సహకరించుచున్నట్లు శ్రీ వేంకటేశ్వరులు గారికి పెక్కుమహా గ్రంథములకు దేవస్థానము సాయముచేయుట వారి అర్హతను బట్టి, వారి గ్రంథముల ఉత్కృష్టతను బట్టియే జరిగినది కారని అన్యథాకాదని వారి గ్రంథములు సర్వజ్ఞాన నీతిధర్మ ప్రబోధకము లగుట, దేవస్థానము వారి ఆదర్శములకు ఆచరణరూప మిచ్చుటకు మిక్కిలి సాయపడినవని ప్రశంసించిరి.

శ్రీమతి నేత్రకంటి రమాదేవి శ్రీ బులుసు వేంకటేశ్వరుల కవితా రచనా పటుత్వమును, లాలిత్యమును, విషయ ప్రదర్శన వైశిష్ట్యమును గుఱించి దేవీ భాగవతమును గుఱించి ఆధ్యాత్మిక ప్రచార ఆవశ్యకతను గురించి ఉపన్యసించిరి.

శ్రీ కంగుకూరి శ్రీరామ చంద్రమూర్తి శ్రీవేంకటేశ్వర విరచిత శ్రీ దేవీభాగవతము నుండి శ్రీ రామాయణమునుండి కొన్నిఘట్టములు కావ్యగానము చేసిరి.

శ్రీ ఆంజనేయశర్మ ఆహ్వానింపగా భక్తులు కొందరు శ్రీ వేంకటేశ్వరునకు నూతన వస్త్రాదులు, చందన తాంబూలాదులు సమర్పించి వేయిన్నూటపదారులు బహూకరించిరి.

శ్రీ వేంకటేశ్వరులు కృతజ్ఞత తెలిపిరి. శ్రీ రాయప్రోలు వారి వందన సమర్పణముతో శ్రీ సూర్యకుమారి మంగళ గానముతో సభముగియుసరికి తొమ్మిది గంటలైనది. (వి. యస్.)

---

# సమాలోచన సంపుటములు

వివిధ సాహిత్యాది విషయాలకు చెందిన 241 రచనలతో కూడిన సమాలోచన తృతీయ సంపుటము 24 సంచికలు ఒకే వాల్యూముగా హాఫ్ క్యాలికో బైండు చేయబడి అమ్మకమునకు సిద్ధముగా నున్నది.

వెల రు. 20 లు. ఎం. ఒ. ద్వారా పంపినవారికి పోస్టుఖర్చులు మేమే భరించి రిజిష్టర్డు పోష్టులో పంపగలము. వి. పి. పద్ధతి లేదు.

మొదటి, రెండవ సంపుటముల వాల్యూములు పూర్తిగా అయిపోయినవి.

— సంపాదకుడు.

అడ్రసు :—

సంపాదకుడు, బులుసు సీతారామశాస్త్రి,
రిటైర్డు తెలుగు లెక్చరరు, వి. టి. జె. కాలేజి,
6-8-7, ఇన్నీసుపేట (త్యాగరాజనగర్), రాజమండ్రి-1.

Editor, Printer and Publisher B. Sitharama Sastry, Printed at B. V. & Co., Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1.